శ్రీః

# మణిమంజరిలో మణిపూసలు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంకలనం చేసిన
చాటుపద్యమణిమంజరిలోని కొన్ని కవితల పరిచయం



పరిమి శ్రీరామనాథ్

## ఒక మాట

ఆంధ్రభారతికి ఉన్న అనేకకవితాముఖాలలో చాటుకవితాముఖం ఎంతో సొగసైనది. శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వల్ల తెలుగు దేశంలోని రమణీయమైన చాటుసాహిత్యం వెలికివచ్చింది.

కావ్యానికి నిడివి ఇంత అన్న నియమం లేదు. సంస్కృతంలో కేవలం ఒక శ్లోకాన్నే కావ్యమని వ్యవహరించడం ఉన్నది. శతకాలూ, ప్రబంధాలూ, మహాకావ్యాలల్లో వందనుండి వేలకు వేలు పద్యాలుండటమూ తెలుగు సాహిత్యంలో ఒకవైపు అయితే, చాటుసాహిత్యంలో ఒక పద్యమో రెండు పద్యాలో ఒక విషయం మీద ఎక్కువగా కనబడడం రెండవవైపు. అయితే, ఒక విషయంపైన ఆధునికకాలంలో ఖండకావ్యనిర్మితి జరగడానికి ముందే, తెలుగు చాటుపద్యసాహిత్యంలో ఒకపద్యాన్ని మించిన సంఖ్యలో కవితలు వ్రాయబడ్డాయని చాటుపద్యమణిమంజరిని చూస్తే అవగతమౌతుంది. ఆ అంశాన్ని పట్టుకుని, అటువంటి కవితలను ఏరి, వాటిని పరిచయం చేస్తూ చిరు వ్యాసాలుగా వ్రాసాను. ఒకటి రెండు వ్యాసాలు ఒక విషయం పైన రెండుమూడు కవితలలోని పద్యాలను గుదిగ్రుచ్చి కూడా వ్రాసాను. ఇవి మొత్తంగా 10.

కవిత్వపిపాసువులకు ఈ చిన్ని ప్రయత్నం సంతోషాన్నిస్తుందని ఆశిస్తాను.

పేకేరు,
ప్లవ మాఘ శుద్ధ సప్తమీ.

బుధజనవిధేయుడు,
పరిమి శ్రీరామనాథ్.

# విషయ సూచిక

# 1

## విరహంపై కాసిని చాటువులు

ఫిబ్రవరి ఏడవ తారీఖు వేటూరి ప్రభాకరశాస్త్రి గారి జయంతి. ఈ మహానుభావుడు తెలుగు భాషకి చేసిన ఉపకారం అన్యదూరమైనది. ప్రజల జీవితంలోకి చొచ్చుకొని, వారి నోళ్లలో నానుతూ ఉన్న మహోదాత్తమైన కవితాసంపదని ముద్రాపించి, మన ముందు తరాలవారి హృదయాలలో తులని మనకందించారు. వీరి చాటుపద్య మణిమంజరి తెలుగువాడి జీవితానికి నిలువుటద్దం.

సంస్కృతసాహిత్యానికి దీటుగా శృంగార రసాన్ని పోషించింది తెలుగు భాషే. కవితాసృష్టిలో అత్యంతవిస్తారమైన పోకడలు పోయిన సంస్కృతభాషతో తుల్యతని పొందడమే కాదు, ఆ తుల్యతని దాటిపోయిన మహాకవులు తెలుగునేలని సుసంపన్నం చేశారు. దానికి కారణం, సాధారణంగా సాధ్యపడని చాటురూపంలో మహత్తరమైన కవితలు ఈ నేలమీద పురుడు పోసుకోవడమే. సంస్కృత సాహిత్యంలో విడివిడిగా రచించబడిన ముక్తకశ్లోకాలు తామరతంపరగా పుట్టుకొచ్చినవి ఉన్నాయి కానీ, తెలుగు కవులకి ఈ ప్రతిభ సంస్కృతకవులకంటే కూడా అత్యధికం.

సంస్కృతం కన్నా నియమాలెక్కువున్న తెలుగు ఛందస్సులో ఆశువుగా పద్యమాలికలు, కావ్యాలు చెప్పిన మహాకవులు ఎక్కువమంది తెలుగునేల పయిన ఊపిరి తీసుకున్నారు. చాటు పద్యాలలో పసలేని పద్యాలు ఉండగలిగే మాట వాస్తవమే కానీ, భావపరిపుష్టత చేత కొన్ని పద్యాలు ఆశువుగా పుట్టినవంటే కలిగే ఆశ్చర్యం మన హృదయాన్ని అమితానందంతో నింపివేస్తుంది.

విరహం మనిషి మనసుకి అత్యంత సన్నిహితమైన భావనావికారం. ప్రేమ ఉవ్వెత్తున యెగసిపడేది ఈ స్థితిలోనే. ప్రాకృతంలో లాగా, ఒక దంపతులు నిజాయితీతో విరహంలో ఉండి

చెప్పిన కవితలు తెలుగులో ఉన్న సందర్భాలు చాలా తక్కువ. కానీ తెలుగువాడి జీవితంలో ప్రాకృతానికి మించిన తీపితో కవిత్వం ఉందని చెబుతూ మణిపూసలలాంటి పద్యాలు ఒక వెల్లువలాగా చాటుపద్యమణిమంజరి పుస్తకంలో మనకి కనిపిస్తాయి.

వాటిలో కొన్ని -

1

ఆతడు దూరదేశమున కల్కనెపమ్మున౹ బోయి రాడు, నే
నాతని బాసి మన్మథశరాగ్ని౹ దపించుచునున్నదాన నీ
వాతని నన్ను౹ జూచితి వియత్తలమెక్కి సుధాకరుండ! నే
నాతని కంటె౹ జిక్కితినొ యాతడె చిక్కెనొ నాకు౹ దెల్పుమా.

నా ప్రియుడు అలక నెపంతో నన్ను వదిలి దూరదేశానికి వెళ్లాడు. నేను అతడ్ని దూరం చేసుకుని మన్మథబాధతో తపిస్తున్నాను. చంద్రుడా, నువ్వు ఆకాశం నుంచి నన్నూ, నా ప్రియుడ్నీ ఇద్దరినీ చూసి ఉన్నావు కదా. నేను అతడి కంటే చిక్కానో, లేదా అతడే నాకంటే చిక్కాడో చెప్పవూ!

2

లోకాలోకపరీతభూభువన మాలోకించు పుణ్యుండ వో
రాకాచంద్ర!, భవత్సమానముఖి మత్ప్రాణేశ్వరింబాసి నే
నా కందర్పశరాగ్ని కీలలకు లోనై యున్న చందంబు నీ
వేకాంతంబున దెల్పవయ్య, దయతో నేలాలతాతన్వికిన్.

లోకాలోకాలతో భూభువనాన్ని చూసే పుణ్యాత్ముడవైన ఓ పూర్ణచంద్రుడా! నీతో సమానమైన ముఖం ఉన్నటువంటి నా ప్రాణేశ్వరిని వదిలి నేను మన్మథశరాలతో బాధపడుతున్న సంగతి నా ప్రియురాలికి యేకాంతంగా చేరవేయవూ!

3

పరిణామమేమయ్య, ప్రాణనాథుని వార్త విందునో యని యందు చందమామ!
విరహాగ్ని చల్లగా విభుని యాకారంబు కందునో యని యందు చందమామ!
పతికాకు జుట్టిచ్చి మతికాంక్షతీరంగ నుందునో యని యందు చందమామ!
వల్లభుడేవేళ వచ్చునప్పుడే మోవి విందు సేతల యుందు చందమామ!

చక్కదనమున నీసరి చందమామ
యాతడున్నట్టి యూరిపైనయ్య మీరు
పోతిరా నాదు వివరంబు పొసగజెప్పి
సాహసాంకుని రమ్మను చందమామ.

చందమామా, నాకు నా నాథుడు క్షేమంగా ఉన్నాడా అన్న వార్త ఎపుడు వింటానో అనీ, విరహాగ్ని తీరగా నా భర్త ఆకారాన్ని ఎప్పుడు చూస్తానో అనీ, పతికి తాంబూలాన్ని చుట్టి ఇచ్చి, ఆయన్ని ఎప్పుడు సంతోషపరుస్తానో అనీ, వల్లభుడు వచ్చినపుడు అధరామృతాన్ని ఎప్పుడు అందిస్తానో అనీ ఉంది. నావాడు చక్కదనంలో నీ సరిజోడు. అతడు ఇప్పుడు ఉన్న ఊరి పయిన వెళ్లి, నా వివరం చెప్పి, ఆ సాహసాంకుని రమ్మని చెప్పవూ!

4

భామాలలామకు క్షేమమా తెల్పుమా సకళకళాధామ చందమామ!
పల్లవపాణికి భద్రమా పల్కుమా సర్వకళాధామ చందమామ!
కోకవక్షోజకుఁ గుశలమా చెప్పుమా చక్రవాకప్రేమ చందమామ!
పద్మాయతాక్షికిఁ బరిణామమా ధర సంపూర్ణగుణధామ చందమామ!

పద్మలోచన యున్నట్టి పట్టణంబు
త్రోవగాఁ బోదువా నీవు తోయజారి!
సకియ మేలిమి యంతయు సరవిఁ దెలిసి
యందమందంగ రమ్మ యో చందమామ!

ఓ చందమామా! నా భామాలలామ క్షేమమేనా? నా పల్లవపాణి భద్రమేమా? నా కోకవక్షోజకు కుశలమేనా? నా పద్మాయతాక్షికి కులాసాయేనా? నా ప్రియురాలు ఉన్న పట్టణపు తోవలో నీవు వెడతావా? ఆమె అపరంజితనాన్ని చక్కగా తెలుసుకుని నాకు చెప్పడానికి రావూ?!

5

కలిగేనా యొకనాటికైన మదిలోఁ గాంక్షారతుల్ దీరగా
దలకుం బాసిన వెండ్రుకైతి మదనాస్త్ర జ్వాలచేఁ జిక్కితిన్
బలుకుం బంతములొక్కటాయె విధిచేఁ బ్రాణంబులెట్లో కదే
నెలనాళ్లాయను మోముఁజూచి యకటా నీరేజపత్రేక్షణా.

నీరేజపత్రేక్షణా! నిన్ను మళ్లీ కలుసుకోగలిగే రోజు వస్తుందా? నీ బాధలో పడి నా శిరసుమీద వెండ్రుకలు ఊడిపోతున్నాయి. విరహంతో చిక్కిపోయాను. విధి వైపరీత్యం వల్ల, మాటా పంతమూ ఒకటే అయ్యాయి. నా ప్రాణాలగతి యేమిటో?! నీ ముఖం చూసి నెలనాళ్లయిపోయింది!

6

కలలోనైనను బాయజాలనకటా కాంతుండ! నన్ బాసితే
తలపూవాడక పోయి రమ్మనుచుఁ  జెంతం జేరి హస్తాక్షతల్
తలపైఁ జల్లగఁ బూనఁ జేచెమట సంతాపాగ్నిఁ గూడయ్యె న
చ్చెలి ప్రాణేశుని చుట్టు రాఁదిగిచి వైచెన్ సిగ్గు రెట్టింపగన్.

'నా ప్రియుడా! నిన్ను కలలో నైనా విడువలేను. అలాంటిది నన్ను వదిలివెళుతున్నావే, నా సిగలో పూవు వాడకుండా వెళ్లి తిరిగి ర'మ్మని అంటూ ఒక అమ్మాయి  అతని దగ్గరకి వెళ్లి శిరసుమీద అక్షింతలు చల్లుదామని చేతిలోకి తీసుకుని, బాధాతాపం చేత చేతిలో చెమట పుట్టగా, ఆమె తన  ప్రాణేశుని సిగ్గు రెట్టింపవుతుండగా చుట్టివేసింది.

7

భామామణీ! వాడు పైనమయ్యెడు వేళనిమ్ముల నొకడైన తుమ్మడాయె
ముద్దుగుమ్మా! వాడు చద్దిఁ గట్టెడు వేళ పకపక నొకగౌళి పలుకదాయె
యిందుముఖీ! వాడు నిలువెళ్లి పోవుట పంచను బిల్లడ్డగించదాయె
జలజాక్షిరో! వాడు పొలిమేర దాటుచోఁ గడగి గొబ్బునఁ బాల గట్ట దాయె

యేల యూరక అలిగెనో నీలవేణి!
యెన్నఁ డిటు మళ్లి వచ్చునో సన్నుతాంగి!
వేడ్క నానందపరచునో వెలది! నేడు
ఆసపడువారినెరుగడో అబ్జవదన!

భామామణీ! వాడు బయల్దేరే వేళ ఒక్కడైనా తుమ్మడు! వాడు చద్ది కట్టుకునే వేళ ఒక బల్లి అయినా చప్పుడు చెయ్యదు. వాడు వెళ్లిపోతుంటే యే పిల్లో ఎదురైనా రాదు. ఎందుకు ఏ కారణం లేకుండా అలిగాడో తెలియదు. మళ్లీ ఎపుడొస్తాడో, వచ్చి నన్నానందింపచేస్తాడో తెలియదు. ఆశపడే వారిగురించి తెలియనైనా తెలియదేమో!

8

అలరులు సూదులై మలయజాది సువస్తువులగ్నికల్పమై
మలయసమీరముల్ విషసమానములై హిమభానుడైన యా
కలువలరేడు చండకరుకైవడియై కనుపట్టెనయ్యెయో
వలపనుపాపమెట్టిపగవారలకున్ వలదింక దైవమా

దైవమా! పూవులు సూదులలాగా, చందనాది వస్తువులు అగ్నికల్పాలలాగా, చల్లని మలయపవనాలు విషాలలాగా, చల్లని వాడైన చంద్రుడు సూర్యుడిలాగా కనిపిస్తున్నారే! ఈ వలపనే పాపం శత్రువులకి కూడా కలగకుండును గాక.

9

చెలువగుమించుటద్దములు చెక్కులటంచుదలంచి మెచ్చుచున్
కలువలఁ జూచి కన్నులని కైరవమిత్రునిఁ జూచి మోమటం
చలరుచు నీగతిం దరుణి యందము లెంచి విరాళి నొందితిన్
వలపను పాపమెట్టిపగవారలకున్ వలదింక దైవమా.

దైవమా! అందమైన అద్దాలని చూసి ఆమె చెక్కిళ్లనీ, సుకుమారమైన కలువలని చూసి ఆమె కళ్లనీ, చంద్రుడిని చూసి ఆమె మోమనీ అనుకుంటూ అమ్మాయి అందాలని ఎంచి వశత్వాన్ని తప్పాను. ఈ వలపనే పాపం పగవాడికైనా వద్దు!

10

అడుగున ధరించు మాణిక్యమబ్ధిరాజు
కణగి శిరమున దాల్చును గడ్డిపోచ
వనధిదే గాని దోషమెవ్వరిది కాదు
మణి మణియె పూరి పూరియె మందగమన.

ఓ మందగమనా! మాణిక్యాన్ని సముద్రుడు అడుగున ఉంచుతాడు(సముద్రగర్భంలో రత్నాలున్నాయని ప్రతీతి). గడ్డిపోచని నెత్తిమీదకెత్తుకుంటాడు (తేలుతుంది కనుక). ఆ దోషం సముద్రుడిదే కానీ ఎవరిదీ కాదు. మణి మణే. గడ్డిపోచ గడ్డిపోచే.

*

# 2

# చాటువులలో శివుడు

ఈ దేశంలో భగవంతుడు కవితకి యెప్పుడో దాసోహమన్నాడు. కవిత్వపు సామాగ్రి ఏదైనా సరే, అది భగవంతుడికి అన్వయింపబడనిది, ఈ దేశపు వాఙ్మయంలో అసలు కనిపించదు. భగవత్తత్త్వాన్ని ప్రతిపాదించే భాషతో పాటుగా, లౌకికమైన భావాలలోనూ భగవంతుడు అంతే అందంగా ఇమిడిపోయాడు. ఆయన ఉదాత్తతని యేమాత్రమూ తగ్గించకుండా నింద చేసి ఆయనను తగ్గించి, అదీ 'అంతే అందంగా ఉందే' అని అనిపించుకోగలిగిన బుద్ధి భారతీయుడిది. సంస్కృతంలో భవగంతుడిని చమత్కారంలో ప్రతిబింబింపచేసే ఒక విస్తారమైన సాంప్రదాయమే కవికులంలో ఉంది. తెలుగులోకూడా అది అంతే అందంగా ఉంది.

తెలుగులో శైవకవిత్వం విలక్షణమైనది. చరిత్రలో 'దేశితనాన్ని' తెలుగువాడిలో మేలుకొలిపింది శివుడే. శివుడి ముందు భక్తితో సాగిలపడిన తెలుగువాడి నోటివెంట అమ్మభాష అలలుకట్టి వెలికి వచ్చింది. చెప్పాలంటే, మన భాషని యథాతథంగా మొదట రుచిచూసిన దేవుడు శివుడే. ఆ తీపిని సేవించి, కరిగిపోయి, ఈ నేలమీదకి దిగివచ్చాడు. ఇక్కడి ప్రతీ పరగణాలోనూ, కొండలోనూ, లోయలోనూ, చేనులోనూ తెలుగు పూత పూసుకుని విహరించాడు. ఆ దగ్గరితనంవల్లనో ఏమో, తెలుగుహృదయంలో కూర్చుని మొదటిసారిగా కావ్యాన్నీ, శతకాన్నీ పురాణాన్నీ, చరిత్రనీ రచించడానికి ఉసిగొల్పాడు.

శివయుగంలో ఈ నేలమీద హొయలుపోయిన తెలుగే తెలుగు. ఆ తీపికి ఎల్లలు లేవు. ఆ ధారకి ఆనకట్ట లేదు. ఆ కవితకి సదృక్షత లేదు. సంగీతానికి అనువైనది ఆ తెలుగు. ఛందస్సులో ఇరుకుకుపోయే తెలుగు కాదది. చదివేటప్పుడు అందులోని సంగీతసంబంధమైన 'యింపు', అర్థాన్ని అతిశయించి ఉంటుంది.

తెలుగు చాటు సాంప్రదాయంలోనూ, శివుడిది ప్రత్యేకమైన స్థానం. భక్తుడి హృదయంలోని లోతుని తట్టి, కేవలం 'నువ్వింత వాడివి, అంతవాడివి' అని మాత్రమే అనిపించకుండా, కల్పనతో కవిత్వాన్ని ప్రవహింపచేసిన అమూల్యమైన పద్యాలు శివుడిమీద చాటుపద్య

మణిమంజరి లో ఉన్నాయి. చాటువులైనా, ఈ తెలుగు కూడా వేరే చోటులలో దొరకని తెలుగు. శివుడి సుగంధాన్ని పూసుకుని, ఆ వాసనని మన మనసుకు పట్టించే తెలుగు.

వాటిలో కొన్ని -

1

భసితము కన్నులంబడినఁ బాములు బుస్సనఁ గంట మంట పె
ల్లెసగి విధుండు గంద నొకయింత గజాసురచర్మమూగినన్
గసరుచు నల్లపెద్దపులి గాండ్రన గిత్తయుఁ దత్తరిల్ల జేఁ
బొసగిన లేడి కుందువడ భూతభయంబున గౌరి లేవ న
వ్వెసగగ సంతరించికొనునీశ్వరుడిచ్చుత మీకభీష్టముల్.

ఇది ఒక ఆశీర్వచన పద్యం - శివ స్తుతి. భాషలో, వర్ణనలో ఎంత లేతైనదో అంత లోతైనది.

అర్థం తెలికే -

శివుడు ఒళ్లంతా రాసుకున్న విభూది కళ్లలో పడిన పాములు బుస్సు బుస్సుమని ఇబ్బంది పడ్డాయి. ఈ చప్పుడుకి శివుడి మూడోకన్నైన అగ్నికి బెదురై, నిప్పులు రేగాడు. ఆ వేడిమికి జటాజూటం మీదున్న చంద్రుడికి ఒడలు కందిపోయింది. ఈ హడావిడిలో శివుడి శరీరానికున్న గజాసురుడి చర్మం ఊగులాడింది. ఆ కదలిక గమనించి, ఇన్నాళ్లూ శివుడు చనిపోయిన చర్మం కట్టుకున్నాడనుకున్నాను, ఈ ఏనుగేదో బతికి వచ్చినట్లుందే అనుకున్న అమ్మవారి వాహనమైన పెద్దపులి ఒక్క ఉదుటున గాండ్రించింది. ఆ అరుపుకి శివుడి వాహనమైన నంది తొట్రుపడింది. వెంటనే భయంతో శివుడి చేతిలో ఉన్న లేడి కంగారు పడింది. ఈ జంతువుల అల్లరికి అదిరి, కూర్చున్న అమ్మవారు లేచి నిలబడింది. ఇదంతా చూస్తున్న శివుడికి నవ్వు వచ్చింది. వెంటనే అందరికేసీ చూసి, 'ఆఁ, ఏం లేదులే, భయం లేదు' అని అందరినీ చక్కబెట్టాడు. అటువంటి శివుడు మీ కోరికలు నెరవేర్చుగాక.

*******

కుటుంబమంటే ఏమిటి? అసలు ఇష్టాఇష్టాలు కలవని మనుషులు పదుల సంఖ్యలో ఒకే పంచన బతికి, దాన్ని ఒక వ్యవస్థగా ఎలా మార్చగలిగారు? ఏ జీవిత భాగస్వామ్యం, ఏదైతే

ఇప్పుడు ఒక ఆడా-మగా ద్వయానికే పరిమితమైందో అది, ఒకప్పుడు ఈ నేల మీద చిన్న పిల్లవాడి దగ్గరనుండి, పండు ముదుసలి వరుకూ ప్రతీ ఇద్దరిమధ్యనా నానావర్ణభూయిష్ఠమై ఎలా కుదిరింది? ఇవన్నీ ఇప్పుడు ఎవరూ అడగని ప్రశ్నలు. మన దేశంలో పరాయి పాలన వల్ల కూలిపోయి శిల్పాలూ, కట్టడాలతో పాటు నిర్వికల్పసమాధిలోకి వెళ్లిపోయిన సద్వస్తువుల్లో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఒకటి.

శివుడి కుటుంబం మీద చాటువులు బోలెడన్ని ఉన్నాయి. నాకు తెలిసి దీనికి ప్రధానమైన కారణం - ఆయన సర్వసంగపరిత్యాగి అయ్యుండి కూడా ప్రపంచంలో ఎవరికీ సాధ్యపడని వ్యతిరేకగుణాలున్న వారిని (జంతువులతో సహా) కలిపుకుని, తన దగ్గర కుటుంబంలా పెట్టుకుని పేరోలగముండటం. ఈ చమత్కారం కవితాత్మకమైన కారణమైతే, అటువంటి సభ్యులున్న కుటుంబం కూడా సనాతమై నిలచింది కాబట్టి, ఆనాటి కుటుంబాలకి అది ఒక ఆదర్శమవడం రెండవకారణం. అలాగే, ఉన్నతిని పొందటానికి ఇల్లూ వాకిలీ విడవక్కరలేదన్న విషయాన్ని, మనుషులతో పాటు ఇతరజీవులూ సమానమే అన్న విషయాన్నీ, శివుడు చెప్పకనే చెబుతున్నాడు. మన దేవతల్లో ఇటువంటి కుటుంబమున్న ఇంకో దేవుడు లేడు.

పరాయివాళ్లు మన వ్యవస్థల్ని ధ్వంసం కొంతలో కొంత చేసినా, ముఖ్యంగా ఈ సంస్కృతిని వాళ్లు వెళ్లిపోయాక వాళ్లని అనుకరించే క్రమంలో మనకి మనం నాశనం చేసుకున్నదే ఎక్కువ అని నేననుకుంటాను. సమాజంలోని పేదరికం కూడా కారణమే దీనికి. నలుగురు మనుషులు కలిసుండటానికి చాలా కారణాలుండవచ్చు. కానీ విడిపోవడానికి కారణం మాత్రం, వైయక్తిక స్వేచ్ఛకి కావలసినదానికన్నా ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం ఒకటి; రెండవది తన స్వార్థపు సీమల్ని కోసేసుకుని, పెళ్లాం- పిల్లలకో లేదా తనవైపుండే ఏ మరో ఇద్దరికో పరిమితం చేసుకోవడం ఒకటి. ఈ భావజాలాల్ని పూర్తిగా విడిచిపెట్టినా ప్రమాదమే, అలాగని పెంచుకున్నా ప్రమాదమే. ఈ విచక్షణ మన పూర్వులకి ఎరుకలో ఉందనీ నాకనిపించదు. వారికి ఎలాగో తెలియకుండా వచ్చి చేరింది. ఆ విలువైన దారం తరువాత తెగిపోయింది. మరి వైయక్తిక స్వేచ్ఛనీ, కుటుంబ వాతావరణాన్నీ ఎలా సమపాళ్లలో ఉంచుకోవాలో శివుడే తాను విరాగి అయిఉండీ ఇంత పెద్ద కుటుంబాన్ని కలిగి ఉండటం ద్వారా చెబుతాడు.

ఈ పద్యం ఒక ఘట్టపు చిత్రణ.అది కలహపూరితమైనది. ఇది అస్తమానూ జరిగేది కాదు, అస్సలు జరగనిదీ కాదు. ఇందులో శివుడి కుటుంబంలోని ప్రతీ సభ్యుడూ తమ తమ సహజగుణాన్నే చూపించాయి. ఆ గుణం కూడా ఇతర సభ్యులకి లేదా తమకి (భయము) నష్టం కలిగించేదే. ఇక్కడ ఇతర సభ్యుల కోసం తమ స్వభావాన్ని అణచుకోవడం కనిపించదు. అంటే కుటుంబంలో కలహాలు వస్తాయి కానీ, ఆ వాతావరణం సహజంగా ఉండదు. కానీ జరుగుతుంది. జరిగినప్పుడు ఈ పద్యంలో లాగా కేవలం ఒక్కరిద్దరే కాదు, కుటుంబంలోని ప్రతి

సభ్యుడూ ఆ పరిస్థితి బారిన పడి కష్టపడవచ్చు. అప్పుడు కుటుంబపెద్ద అయిన శివుడికి నవ్వు వచ్చింది - అదీ సహజంగా. ఆ నవ్వు పరిహాసం కాదు. తన కుటుంబంలోని సభ్యులని అర్థం చేసుకోవడం వల్ల వచ్చిన నవ్వు. ఆ నవ్వుతో శివుడు కుటుంబంలో పెద్దరికాన్ని సూచిస్తున్నాడు. ఆ పెద్దరికం వయసు వల్లో, భర్తకాబట్టో వచ్చింది కాదు. ఇతర సభ్యులు తమ సహజగుణానికి లొంగిపోతే, శివుడు లొంగక, పరిస్థితిని పరికించగలిగాడు. వారివారి మనోభావాలని అర్థం చేసుకోగలిగాడు. తత్సూచకంగానే నవ్వు వచ్చింది, కుటుంబంలో ఇదీ సాధారణమే అన్నట్లుగా. ఇదీ పెద్దరికాన్ని సూచించే లక్షణం. మన కుటుంబంలో ఈ పెద్దరికం అందరికీ ఉండాలి. వయస్సువల్లో, తమ తోటి కోడళ్లూ, కొడుకులకంటే ధనాధిక్యత కలిగి ఉండటం వల్లో ఈ పెద్దరికం రాదు. వచ్చినా అది పెద్దరికమవదు - అదే శివుడి నవ్వు కల్పనలోని ఉద్దేశ్యం. అదే ఈ పద్యానికి జీవస్థానం.

మరి ఆ పెద్దరికాన్ని ఆచరణలో కూడా పెట్టాలి. అదే 'సంతరించికొను' అన్న పదం. సమస్యకి తగ్గ క్రియ. అందరినీ ఊరుకోబెట్టడం. ఇది చేసినవాడే పెద్ద. ఈ పెద్దరికం కుటుంబంలోని ప్రతీ వ్యక్తీ సందర్భాన్ని బట్టి ప్రదర్శించాల్సిరావచ్చు. గుణంగా అది వేరే వేరే పాళ్లలో అందరిదగ్గరా ఉండాల్సిన లక్షణం. అప్పుడు కలిసి ఉండమనీ, విడిపొమ్మనీ ఎవరూ ఏ కుటుంబ సభ్యునికీ చెప్పక్కర్లేదు.

2

నిఖిలభూధరదరీనిమ్నోన్నతస్థలీవిహరణాగతమైన వెనుకబెణుకుఁ
యమిరక్షణార్థమై యమహృత్కవాటంబుఁ బగులదన్నిననాఁటి పాతనొప్పి
బ్రహ్మాదిసకలనిర్జరకృతార్చనకాలమున నిల్వఁబట్టిన మొనయుగుదులు
నేకాంఘ్రిపై నిల్చి నృత్యమత్యంతంబు విరచించునాఁటి తిమ్మిరియుఁ దీర

తోమి గ్రుద్దెదఁ బిసికెద ధూళిఁదుడిచి
వ్రేళ్లు విరిచెదఁ జూపవే కాళ్లు తండ్రి!
నిగమనుతకీర్తి! యెలకుర్తి నగరవర్తి!
యీశ! మల్లేశలింగ! క్షమాశతాంగ!

ఒక భక్తుడు శివుడితో ఇలా అంటున్నాడు -

లోకరక్షణ కోసం సమస్తమైన పర్వతాలు, గుహలు, ఎత్తులు లోతులు తిరుగగా పుట్టిన బెణుకు, ముని అయిన మార్కండేయుని రక్షించడానికి యముని గుండెని తన్నినప్పుడు కలిగి ఇంకా సలుపుతున్న అప్పటి నొప్పి, బ్రహ్మాది దేవతలు నిన్ను నిలబెట్టి పూజ చేసేటప్పుడు నీకు కలిగే గుదులు, ఒకే పాదాన్ని ఆనించి అభినయిస్తూ నాట్యం చేసేటప్పుడు నీకు కలిగే తిమ్మిరి - ఇవన్నీ తీరే విధంగా  తోమి, మర్దించి, పిసికి, ధూళి ని దులుపి, హాయి కలిగేలాగ నీ వేళ్ల మెటికలు విరుస్తాను. యెలకుర్తి పట్టణ మల్లేశస్వామీ! నీ పాదాలని నాకు చూపించు!

3

తారకాసురభుజాదర్పంబుదెగటార్చు ఘనుఁగన్నతండ్రి మా యనుగు వేల్పు
కుండలిజ్యావల్లి కొండవింటను గూర్చు విలుకాండ్రమేటి మా కులగురుండు
తలిరాకుబాకు గద్దరి వజీరుని క్రొవ్వు మట్టుపెట్టిన దిట్ట మాకుఁ బ్రాపు
హత్తి తెల్లనిగిత్త కత్తలాణమునెక్కి మహి మించుసెబకాడు మా ధనంబు

జాటజూటాగ్రవీథిని జహ్నుకన్య
మమతనిడుకొన్న వగకాడు మా బలంబు
పార్వతీసాధ్వి సామేనఁ బాదుకొల్పి
వెలయుపటుశీలి మా పాలి వేల్పుమొదవు.

తారకాసురుడి గర్వాన్ని ఎండగట్టిన ఘనుడైన కుమారస్వామిని కన్న వాడు మాకు ముఖ్యమైన వేలుపు. పాముని కొండవింటినారిగా చేసిన మేటివిలుకాడు మా కులగురువు. చిగురాకులని బాణాలుగా కలిగిన నేర్పరి మన్మథుడి కొవ్వు దించిన దిట్ట మా ఆశ్రయము. యేనుగులాంటి తెల్లని గిత్త రథంమీద యెక్కి అతిశయించే పరిపూర్ణుడు మా ధనము. జడల మీద గంగని మమతతో ఉంచుకొన్న విలాసవంతుడు మా బలము. పార్వతీదేవిని సగందేహంలో పాదుకొల్పి ప్రకాశించే బలవంతుడు మా కామధేనువు.

4

ఆలపోతులతేని నాతని పగవానిఁ బెంపంగఁ జంపంగఁ బెంపు గలిగి
హాలాహలపుమందు హల్లకములవిందు గుడువంగ ముడువంగఁ గోర్కి గల్గి
ఎడమదిక్కువధూటి జడలమక్కువబోటిఁ బొలపింప వలపింపఁ బొందు గలిగి
పచ్చియేనికతోలు ప్రాఁతకంగటికాలు కట్టంగఁ బట్టంగఁ గణక గల్గి

ఎసగి లోకంబులీరేడు నేలువాని
మిగులఁ బొడపైన తెల్లని మేనువాని
మహితవృషరాజునెక్కిన మహిమవాని
మృడునిఁ గనుగొంటినంతట మేలుకొంటి.

ఆవుల రాజైన నందిని పోషించేటటువంటి, నందికి శత్రువైన అధర్మాన్ని చంపేటటువంటి అతిశయం కలిగీ; హాలాహలమనే మందుని కుడిచేటటువంటి, చెంగలువల అతిథి అయిన చంద్రుడిని ముడిచేటటువంటి కోర్కె కలిగీ; యెడమదిక్కున ఒక స్త్రీకి చిరునామా ఇచ్చేటటువంటి, జడలంటే ఇష్టపడే ఇంకొక స్త్రీని మోహింపచేసేటటువంటి కలయిక కలిగీ; పచ్చి ఏనుగు చర్మాన్ని కట్టుకునే, పాత మంచపు కోడుని పట్టుకునే ప్రయత్నం కలిగీ;నందిని అధిరోహించి, మహిమాన్వితుడై పదునాలుగు లోకాలని పరిపాలించే తెల్లని మేను కలిగిన పరమేశ్వరుని కనుగొన్నాను. తరువాత మేలుకొన్నాను.

5

శీతాద్రియామ్యదిక్సీమభూములుఁ గంటిఁ జెలువైన కేదారశిఖరిఁ గంటి
ఉగ్రుని నిజకాంత నుమఁ జెంత కనుగొంటి మధుమాధవుని దైత్యమథనుఁ గంటి
కంటి విఘ్నేశ్వరు గణనాథు కనుగొంటిఁ జండభైరవుని గోస్వామిఁ గంటి
ఉత్తమసంస్తుత్యునుత్తరార్కునిఁ గంటి గాలభైరవు ఛన్న ఘంటఁ గంటి

కంటి వటవృక్షమాదిమగంగఁ గంటి
గంటిఁ కేదారకుండోదకములు గ్రోలి
మహితవృషరాజునెక్కిన మహిమవాని
మృడునిఁ గనుగొంటినంతట మేలుకొంటి.

మంచుకొండలలో చందనాలతో కూడిన భూములని చూశాను. రమ్యమైన కేదారశిఖరాన్ని చూశాను. ఉగ్రుడైన శివుని కాంత పార్వతీదేవిని శివుని దగ్గర ఉండగా చూశాను. అక్కడే కొలువైన విష్ణుమూర్తిని చూశాను. గణనాథుడైన విఘ్నేశ్వరుడినీ, భైరవుడినీ, నందినీ చూశాను. ఆదిత్యుడైన ఉత్తరార్కుడినీ, కాలభైరవుడి ఛన్న ఘంటనీ చూశాను. వటవృక్షాన్నీ కాంచాను. గొప్పదైన నందివాహనాన్ని ఎక్కిన మహిమాన్వితుడైన మృడుడిని చూశాను. తరువాత మేలుకొన్నాను.

(పై రెండు పద్యాలూ 'మృడుని కనుగొంటి ' అనే కవితలోనివి. )

6

సర్వసర్వంసహాసముదయంబు రథంబు రథమధ్యముననున్న రాయి విల్లు
విల్లువెంబడి దిర్గు వెలుగులు చక్రాలు చక్రాలకును వైరి చారు నారి
నారి బట్టుక తిర్గునాగరకుడు గరి గరిమీద విహరించు ఘనుడు శరము
శరము నాభికనున్న శతవృద్ధు సారథి సారథి మాటలు సైంధవములు

గాగ నేగుదెంచి కణకతో బురములు
గెలిచినట్టి ఘనుడు గిరిజతోడ
గలసి యుండునట్టి కరుణాసముద్రుండు
నిష్టసిద్ధులొసగు నెలమి మనకు.

అన్ని వస్తువుల సమాహారమూ రథము కాగా (భూమి), ఆ రథం మధ్యలో ఉండే రాయి విల్లు కాగా (మేరుపర్వతం), ఆ విల్లు చుట్టూ తిరిగే చక్రాలు రథచక్రాలు కాగా, ( ఆ పర్వతం చుట్టూ ఉదయించి అస్తమించే సూర్యచంద్రులు), ఆ చక్రాలకు శత్రువైనది నారి కాగా (ఆదిశేషుడు), పక్షిమీద విహరించే ఘనుడు శరము కాగా (విష్ణుమూర్తి), ఆ శరము నాభిలో ఉన్న అతిపెద్ద ముసలివాడు సారథి కాగా (బ్రహ్మదేవుడు), ఆ సారథి మాటలు గుర్రాలు కాగా (వేదాలు); యేతెంచి ప్రయత్నంతో మూడు పురాలని గెలిచిన ఘనుడు , పార్వతీదేవితో కలిసి ఉండే కరుణాసముద్రుడైన శివుడు మన కోరికలని ప్రేమతో ఇచ్చుగాత.

7

మనము గారామునఁ బెనిచినయట్టి చకోరికాశిశువులాకొనక యుండ
మన గొజ్జగల తోటమహి నిందుకాంతంపుఁ బాదులలో నీళ్లు పాయకుండ
మనకేళికావన మధ్య దీర్ఘికలలోని తొగలొకయప్పుడు మొగుడకుండ
మనసరోజినిలోన మరిగిన జక్కవదోయి నీ చనుదోయి దొరయకుండ

నుండుఁగాని సదాశివుండొడ్డినాడు
మొలకచందురు గెలువుమీ పలుకుననుచు

నగజ చెలులాడు మాటలకలరు శివుడు
మనలఁ గరుణావిధేయుడై మనుచుగాఁత.
శివపార్వతులు సల్లాపాలాడుతున్నారు. తన మాట నెగ్గించుకునేందుకు శివుడు, 'నేను చెప్పినదే నిజం, కావాలంటే, నా శిరసుమీద ఉన్న చంద్రుడ్ని పందెం కాస్తున్నాను' అని అన్నాడు. అది విన్న పార్వతీదేవి చుట్టూ ఉన్న చెలికత్తెలు  ఇలా అంటున్నారట -

"సఖీ, పార్వతీ! మనం గారాబంగా పెంచుకుంటున్న చకోరపక్షి పిల్లలు ఆకలితో అలమటించకుండా, మన చేమంతితోటలో ఉన్న ఇందుకాంతపు పాదులలో నీళ్ల కరువు రాకుండా, మనం విహరించే వనాలలోని బావులలో కలువపూలు ముడుచుకొని పోకుండా, మన తామరకొలను దగ్గర కలిసి విహరించే చక్రవాక పక్షుల జంట నీ చనుదోయికి సమానం కాకుండా ఉంటుందిలే, ఈ మాటని గెలువు, సదాశివుడు చంద్రుడ్ని ఒడ్డాడు"

ఈ మాటలు విని, సంతోషాన్ని పొందిన శివుడు మనలని కరుణతో రక్షించుగాక.

# 3

# భ్రమరాంబామల్లీశ్వరసంవాదము

కొన్ని యోజనాలదూరంలో ఉన్న వస్తువునైనా మనసుకి తెచ్చుకోగలగడం మనకి మాత్రమే సాధ్యపడిన విద్య. భగవదుపాసన సహజంగా భారతదేశమనే పొదకి పుష్పించిన పూవు. భారతజాతి తాను ఉపాసించే దైవమనే వస్తువుకి తన సర్వమూ అర్పణ చేసింది. కటిక ఉపవాసాది ఆచారాలతో భౌతిక సుఖాలని తెంపుకుంది. యెనలేని బలంతో మనసుని తన దేవత ముందు పెట్టింది. దాని ఫలితంగా వేరెవ్వరూ ఊహించని భగవత్సుఖంలో తేలియాడగలిగింది. లౌకికసుఖాలని కొనగోరుతో నేలరాయగలిగింది. ఉపాసనలో ఇంత కఠినత్వాన్ని చూసి వీళ్ల దేవత వీళ్లకి ఎంతదూరమో అని అనుకునే లోగానే, ' మనిషి వికారాలన్నింటినీ ఆ దైవానికే ముడివేసి, మానవసంబంధాలలోని శృంగారాది విషయాలలోనూ

తన దైవాన్ని చూసుకుని ఆ దైవం తనకి యెంత దగ్గరో నిరూపించింది. ఇది ఇతరులు కనీసం ఊహకూడా చేయలేని విషయం. ఇక్కడ భగవంతుడు ఉపాసకుడికి ఆధ్యాత్మిక సమాధినీ ఇవ్వగలడు, అదే ఉపాసకుడి లౌకిక చమత్కారానికి బలై నవ్వులపాలూ కాగలడు.

మానవానుభూతిలోని తీపిని వడకట్టి, దివ్యత్వాన్ని ఆపాదించడమే భక్తి లక్షణమని నా ఊహ. ఈ భక్తి విద్యుత్తు తగిలి కంపించే వ్యక్తికి రెండు విషయాలే అనుభూతిలో ఉండేవి. ఒకటి ఆవాహన, రెండు అర్పణ. దైవాన్ని తనమీదకి తెచ్చుకోవడం ఆవాహన అయితే, తనదని అనుకున్నదాన్ని దేనినో ఆ దైవానికి సమర్పించడం అర్పణ. ఆ స్థితిలో ఉన్న వ్యక్తుల అనుభూతిలో ఉండే భగవంతుడు మామూలు మనుషుల 'తెలివి' లో పట్టడు. ఆ దృష్టికి రెండు అనేవి తెలియవు. అందుచేతనే, నిజాయితీతో భగవదర్పణ చేసిన వస్తువు నీచమైనదైనా, సుగంధభరితమవుతుంది.

పార్వతీపరమేశ్వరులని భార్యాభర్తలుగా చూపుతూ అల్లిన ఒక మహోత్కృష్టమైన కవిత చాటుపద్య మణిమంజరిలో ఉంది. ఈ కవిత పేరు భ్రమరాంబామల్లీశ్వరసంవాదము. దీనిని ఇదివరకు శివాలయాలలో గౌరీశంకరుల ఉత్సవవిగ్రహాలని యెదురెదురుగా కూర్చుండబెట్టి చదివేవారట! తెలుగులో, ఇంత తీయనైన అమృతాన్ని పూసుకుని ఉన్న ఈ కవితని గుడిలో చదివితే కలిగే ఉద్దీపనని నేను ఊహించి, ఆ ఆనందాన్ని పంచుకోవాలనే ఉద్దేశంతో మీకోసం ఆ కవితని ఇక్కడ అనువదిస్తున్నాను.

1

శ్రీమద్భూమిధరాధిరాజతనయా శృంగారగాత్రోజ్జ్వలా
నా మీఁదన్ దయలేక నీవును వృథా నన్నేల వీక్షింపవే:
ప్రేమన్ వేట నెపంబునన్ జని పరస్త్రీఁ గూడినావిప్పుడున్
శ్రీమించన్ ననుగూడనేల పదరా శ్రీశైల మల్లీశ్వరా.

'భూమిని మోసే హిమవంతుని కూతురా! శృంగారకలితమైన మేను కలిగిన దానా! నా మీద దయలేకుండా పోయిందా నీకు? నీవుకూడా యెందుకు నన్ను చూడటంలేదు?'
'శ్రీశైల మల్లీశ్వరా! యెంతో ఇష్టంగా వేటకని చెప్పి పోయి పరస్త్రీని కూడావు. ఇప్పుడు నేను కావలసివొచ్చానా?'

2

భామారత్నమ! యెవ్వతో మఱుఁగుగాఁ బాటించి చెప్పంగఁబో
నేమైనన్ గుఱు తిందుకుం గలదటే యా సందియంబేలనే
యామోదంబున నీవు వచ్చినవిధంబాతీరు కన్పించెరా
శ్రీమించన్ గురులేటికిం జెదరెరా శ్రీశైల మల్లీశ్వరా

'భామారత్నమా! నామీద ఇంతటి అభాండం వెస్తున్నావే, దీనికి ఏమైనా సాక్ష్యం ఉన్నదా?'
'శ్రీశైలమల్లీశ్వరా! నీవు ఎంతో ఆనందంగా వచ్చిన తీరులోనే నేను కనిపెట్టాను. అలా అయితే, నీ కురులు ఎందుకు చెదిరినట్టో మరి?'

3

మృగసందోహమువెంబడిన్ బొడల దూరేపోవఁగాఁ గొమ్మలన్
దగులంగాఁ గురులన్నియుం జెదరెనే తథ్యంబుగా జూడవే:
మిగులం బొంకితివిందుకుం జతురతన్ నీమోవిపై నేటికిన్
జిగిమించన్ బలుగెంపులెక్కడివిరా శ్రీశైలమల్లీశ్వరా!

'నేనేదో లేళ్లవెంట ఆయాసపడుతూ పోతూంటే కొమ్మలు తగిలి నా కురులు చెదిరాయి, సరిగ్గా చూడవేం?'
'శ్రీశైల మల్లీశ్వరా, బాగానే బొంకుతున్నావు, మరి నీ పెదవి మీద ఆ కొరుకుడులెక్కడివి?'

4

చిలుకం దెచ్చిన ముద్దు సేయుతఱిఁ జూచెం బింబభావంబునన్
జెలియా గ్రక్కున నాదు మోవిఁ గఱచెన్ సిద్ధంబుగా జూడవే
బళిరా! నేర్పున బొంకి చెప్పితివిగా బాగాయె నీకోకలన్
జిలిమించన్ బసపేటి కంటె జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

'అదీ అనుమానమేనా? ఆ అడవిలో ఒక చిలుకని ముద్దు చేసాను. అది నా క్రింద పెదవిని దొండపండనుకొని కరిచింది. నువ్వే చూడు, రక్తం యెలా కారుతోందో?'
'శ్రీశైల మల్లీశ్వరా, ఇంత నేర్పుగా బొంకి మాట్లాడుతున్న నిన్ను మెచ్చుకోక తప్పదులే కానీ, నీ బట్టలమీద పసుపు యెలా అంటుకుందో అదైనా చెప్పు!'

5

వరపద్మాకరమధ్యమస్థలములన్ వర్తింపఁ బద్మంబులం
దొరయన్ గోఁకలనంటెఁ బుప్పొడులివే యొచ్చెంబు చేసేవటే
సరసత్వంబున బొంకి చెప్పితివి నీ స్వాభావమే చెక్కులన్
స్థిరవీటీరసమేటికంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

'ఇది మరీ బాగుంది. నీకోసం పద్మాలని తీసుకువద్దామని కొలను దగ్గరకి వెళితే అక్కడి పుప్పొడులు నా బట్టలనంటుకున్నాయి. సరిగ్గా చూడు!'
'నేనంటే అంత ఇష్టమా నీకు! చాలా సరసంగా అబద్ధం చెప్పావు. సరే, ఇది చెప్పు, నీ చెక్కిళ్లమీద తాంబూలరసం అంటుకున్నదేవిటి?'

6

సింగంబున్న గుహాంతముల్ వెదకుచోఁ జేగుర్లపై డిగ్గుచుం
డంగం జెక్కుల జేగురంటె నెఱయన్ నారీశిరోరత్నమా
అంగీకారము జేసికొంటినది నీ యంగంబుపైఁ గ్రొన్నెలల్
సింగారించిన భామ పేరు చెపురా శ్రీశైలమల్లీశ్వరా

'నేనేదో సింహాలున్న గుహలలో వెతుకుదామని యెర్రమన్నులమీదకి దూకి పడ్డాను. అక్కడి యెరుపేదో నా బుగ్గలకి అంటుకుని ఉంటుంది అంతే'
'శ్రీశైల మల్లీశ్వరా, సరే అయితే, దాన్ని నమ్ముతాను. కానీ నీ శరీరంమీద గోటి గిల్లుడులున్నాయి. ఇక దాపరికాలు కట్టిపెట్టి, అవి అలంకరించిన భామ పేరు బయటపెట్టు.'

7

తరుణీరత్నమ! డేగ వీడ్వడి మహాదర్పంబునం బోవఁగాఁ

దిరుగుం బట్టఁగ డేగగోరులు పయిన్ దీవ్రంబుగా నాఁటెనే
సరవిన్నన్నిటికన్ని బొంకితివిగా సర్వజ్ఞ! నీ కన్నులన్
సిరిమించన్ యెరుపేటికంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా

'తరుణీ! నేను వేటలో ఉన్నప్పుడు ఒక డేగ చాలా పొగరుతోటి ముందుకీ వెనుకకీ యెగురుతూ నన్ను ఇబ్బంది పెట్టింది. దాని గోళ్లు నా మీద తీవ్రంగా నాటుకున్నాయి. అవే ఈ నఖ క్షతాలు'
'ఆహాఁ, యేమాత్రమూ తడబాటు లేకుండా ప్రతీ దానికీ బొంకుతున్నావే, మరి నీ ఎరుపెక్కిన కళ్ల గురించి కూడా చెప్పు.'

8

వేమాఱున్ నను నేరముల్ పలుకఁగా వ్రీడాంతరంగుండనై
నీమీఁదన్ కఠినోగ్రదృష్టి నిలుపన్ నేత్రంబులిల్లాయనే
నీమాటే యొకటైన సత్యమటరా నే విశ్వసించంజుమీ
శ్రీమత్కాంచనశైలకార్ముకధరా శ్రీశైలమల్లీశ్వరా

'ఆ యెరుపు ముందు నుంచీ ఉన్నది కాదు. ఇప్పుడు నువ్వు నా మీద మోపుతున్న అభాండాలకి నీ మీద కోపం వచ్చింది. దానికే నా కళ్లు యెర్రబడ్డాయి. అంతే తప్ప నువ్వు అనుకున్నట్లు కాదే! '
'బంగారు పర్వతాన్ని విల్లుగా పట్టినవాడా! శ్రీశైల మల్లీశ్వరా! నీ మాటని ఒక్కదానినైనా నేను నమ్మనంటే నమ్మను '

9

యెమింజెప్పిన నమ్మఁజాలవుదె యే ప్రొద్దు నన్నేఁచకే
పాముం దెచ్చెదఁ బట్టెదన్ వినవె నీ పంతంబులీడేరఁగాఁ
బామే నొమ్ముగఁ జేసినావుగదరా పట్టేది నీకెంతరా
శ్రీమద్భూధరరాజకార్ముకధరా శ్రీశైలమల్లీశ్వరా

'అదేమిటే, యేమి చెప్పినా నన్ను నమ్మకున్నావు. యీ రోజు నన్ను చంపుకుతింటున్నావు కదే, సరే, నీ పంతం నెరవేరేటట్లుగా ఒక పాముని పట్టుకుని వస్తాను. దాన్ని పట్టుకుంటాను. నా అమాయకత్వాన్ని నిరూపించుకుంటాను. సరేనా?'

'ఏమిటీ? పాముని పడతావా? పెద్ద పెద్ద పాములని ఆభరణాలుగా చేసుకున్న నీకు ఒక పాముని పట్టడం లెక్కా?'

10

అది గాకున్నను బాస చేసెదను నీవట్లైన నమ్మంగదే
తుది నా జిహ్వను మడ్డు దాల్చెద నిదే తుచ్ఛంబుగాఁ జూడకే
అది నీకెంత యుగాంతకాలగరళంబన్నంబుగాఁ జేయఁగాఁ
ద్రిదశేంద్రాచ్యుత పూజితాంఘ్రికమలా శ్రీశైలమల్లీశ్వరా

'సరే పోనీలే, అది వద్దులే, ఇప్పుడే నీకు మాట ఇస్తున్నాను, నా నాలుక మీద నిప్పుకణికని ఉంచుకుంటాను. అప్పుడైనా నా నిర్మలత్వం నీకు తెలుస్తుంది. నన్ను తుచ్ఛంగా మాత్రం చూడకు!'
'ఆఁ, హాలాహలవిషాన్నే మింగిన నీకు అదెంతపని?'

11

చెలియా యేమని విన్నవించిన మదిన్ చేపట్టవింతైన నా
వలనన్నేరములెన్నియుం గలిగినన్ వామాక్షి కావంగదే
పలువారిట్టు హళామళుల్ పలుకఁగాఁ బాండిత్యమా వోరి నీ
చెలువంబిక్కడఁ చూపవచ్చితటరా శ్రీశైలమల్లీశ్వరా

'చెలియా! యెంత చెప్పినా వినకున్నావు. నన్ను మనసులో చేపట్టకున్నావు. వామాక్షీ! నా వల్ల తప్పులు యేమైనా జరిగితే నన్ను మన్నించవే!'
'హాఁ ఇలా మాట్లాడటం - అదేం పాండిత్యమో యేమో! నీ మహత్తంతా నా దగ్గర చూపడానికి వచ్చావా?'

12

యేమే! పూర్ణశశాంకబింబవదనా యేమే జగన్మోహినీ
నీమీఁదాన మఱెక్కడన్ నిను వినా నేనెక్కడన్ జొక్కనే
నామీఁదం గరుణించి యేలఁగదవే నన్నుంగటాక్షింపవే
శ్రీమించన్ భ్రమరాంబికా గుణమణీ స్త్రీలోకచూడామణీ!

'ఏమే! పున్నమిచందురుడిలాంటి మోము కలదానా! యేమే జగన్మోహినీ! నీ మీద వొట్టు, నిన్ను వదలి వేరే చోట నేను చేరను. నా మీద కరుణ వహించి యేలరాదా?! నన్ను కటాక్షించరాదా!
ఓ భ్రమరాంబా! గుణమణీ! స్త్రీలోకచూడామణీ! నిన్నే, ఊఁ అనవేం!?'

*

# 4

## అపూర్వాంధ్రశివకవి చక్రపాణి రంగనాథుడు

తెలుగుదేశంలో శివకవియుగం భక్తితో ప్రజల జీవనాన్ని సుసంపన్నం చేయడంతో పాటుగా తెలుగుభాషకూ ఎనలేని సేవ చేసింది. ఆ యుగంలో కవిత్రయం పాలుకురికి సోమనాథుడు, పండితారాధ్యులు, నన్నెచోడుడు తెలుగు దేశీయతకి ఒక కొత్త వేదికని నిర్మాణం కావించారు. ఈ యుగంలోనే తెలుగునేలమీద ఉదయించిన ఒక విలక్షణ కవి రంగనాథుడు. ఈ కవి గురించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలో పరిచయం చేసారు. అక్కడి ఉటంకింపులని బట్టి మణిమంజరి రచనాకాలానికి ఈ రంగనాథుడిమీద పండితులలో వాదోపవాదాలు జరుగుతున్నట్లు ఊహించవలసి వస్తోంది. వాటిలో కాక కవిత్వంలో లగ్నమానసుడ్ని కావడం చేతా, రంగనాథుడి శివకవిత్వం చదివి ఒళ్లు పులకరించిన వాడ్నవడం చేతా, ఆ కవి గురించి మీతో పంచుకుంటున్నాను.

కన్నడిగుడైన తొంటెదార్య కవి వ్రాసిన పాల్కురికి సోమేశ్వరపురాణంలో రంగనాథుడి కథ వర్ణించబడి ఉంది. చక్రపాణి రంగనాథుడు మొదట వైష్ణవుడు. ఇతడితో శైవుడైన పాల్కురికి సోమనాథుడికి తగువు వచ్చింది. అయితే వాదంలో తండ్రిని వద్దని, సోమనాథుడి కొడుకు చతుర్ముఖ బసవేశ్వరుడు వాదానికి దిగాడు. ఆ వాదంలో రంగనాథుడు ఓడిపోయాడు. పరాజయంతో దుఃఖపడి రంగనాథుడు శ్రీశైల మార్గంలో వెడుతూ కూడా శివద్వేషంతో మల్లికార్జునుడి దర్శనం చేసుకోక ముందుకు వెళ్లాడు. దాని ఫలితంగా రంగనాథుడికి చూపు పోయింది. ఆ బాధతో అహోబిలానికి వెళ్లి నరసింహస్వామిని ప్రార్థించాడు. నరసింహస్వామి దయతోనే రంగనాథుడికి స్వప్నంలో శివుడి ఆధిక్యత బోధపడింది. అంతే, అక్కడే, ఒక మహాకవి పురుడు పోసుకున్నాడు.

తరువాత రంగనాథుడు పరమశివుడు వెలసిన ఆ మార్గంలో, ఆ నల్లమల అడవులనూ, పర్వతాలనూ , లోయలనూ, నదీనదాలనూ స్పృశిస్తూ తన స్వామిని అన్వేషిస్తూ శ్రీశైలాన్ని చేరుకున్నాడు. శివుడిని ప్రస్తుతించాడు. దానితో ఒక కంటి చూపు తిరిగివచ్చింది. తరువాత పాల్కురికి సోమనాథుడి దగ్గరికి వచ్చి తన అపచారాన్ని మన్నించాలని వేడుకొన్నాడు. రెండవ కంటిచూపూ తిరిగివచ్చింది. తరువాత రంగనాథుడు సోమనాథుడి శిష్యుడై చతుర్ముఖ బసవేశ్వరుడి చేత శివదీక్షని తీసుకున్నాడు. రంగనాథుడి జీవితం శివుడి తోనూ, కవిత్వంతోనూ నిండిపోయింది. ఈతని భక్తికి శివుడి మనసు పులకరించింది. కవితకి భాషాదేవి మేను జలదరించింది.

రంగనాథుడు శివసాహిత్యంలోనే యెవరూ చేయని పనిని సౌందర్యవంతంగా చేసాడు. అది పంచాక్షరీ మంత్రమహిమని ఒక రగడలో వర్ణించడం. పూర్తిగా నూటయెనిమిది పాదాలతో ఉన్న ఈ నమశ్శివాయరగడ లో ప్రతీ పాదమూ నాలుగు షణ్మాత్ర గణములతో ఉంటుంది.

తెలుగునీ, సంస్కృతాన్నీ సమపాళ్లలో కలిపిన ఒక అందమైన కృతి ఇది. నమశ్శివాయ రగడలో ప్రతీ పాదమూ 'నమశ్శివాయ' అన్న పదంతో ముగుస్తుంది. ఇది షణ్మాత్రల కూర్పు కావడం చేత 'నమశ్శివాయ ' అన్న పదంలో 'న ' అన్న అక్షరం ముందు గణంలో చేరి, 'మశ్శివాయ ' అన్న పదం చివరి గణంలో పడటం వల్ల, నమః, శివాయ అన్న సంధి అందంగా విడివడి, తెలియకుండానే చదివేటప్పుడు 'నమశ్శివాయ' ని పైకి ఎత్తి చదువుతాం. ఆ కవి ఆరాటమల్లా మనతో ఆ నామాన్ని ఎత్తి అనిపించాలనేనేమో అని అనిపిస్తుంది.

ఈ రగడలోని కొన్ని పంక్తులు ఇక్కడ చూపిస్తున్నాను -

ప్రకటధీర భావభర తపశ్చయము నమశ్శివాయ
భూతనాథచరణకమల పూజనము నమశ్శివాయ
ప్రాతతప్రశస్తవస్తుభాజనము నమశ్శివాయ
శోషణాది శుద్ధికరణ శోధితము నమశ్శివాయ
పోషితాగమప్రమేయ బోధితము నమశ్శివాయ
ప్రసవశరవికార భావభంజనము నమశ్శివాయ
రసికలోక రాజలోక రంజనము నమశ్శివాయ
..... ...

పారిజాతఫలసమృద్ధిఁ బండెడిది నమశ్శివాయ
దురితవితతిఁ దూరుపాఱఁ దోలెడిది నమశ్శివాయ
వరములోని నిచ్చుచోట వ్రాలెడిది నమశ్శివాయ
మునులు ఘనులు మించి తలఁచి మ్రొక్కెడిది నమశ్శివాయ
ఓటలేక పుణ్యపథములూరెడిది నమశ్శివాయ
మేటి సుకృతకోటినెల్ల మీఱెడిది నమశ్శివాయ
...
యోగమీ నమశ్శివాయ యోగ్యమీ నమశ్శివాయ
భోగమీ నమశ్శివాయ భోగ్యమీ నమశ్శివాయ
సరసమీ నమశ్శివాయ సత్యమీ నమశ్శివాయ
పరమమీ నమశ్శివాయ బ్రహ్మమీ నమశ్శివాయ

రంగనాథుడు ఐదువందల సీసపద్యాలతో శ్రీగిరినాథవిక్రమం, వేయి పాదాలతో దండకం, ఎనిమిది వేల పద్యాలతో ఒక గ్రంథం, ఒక తారావళి, ఒక శతకం,నాలుగు లయగ్రాహులు, ఏడు రగడలు, వేయి దోదక వృత్తాలు, వంద తోటక వృత్తాలు, మూడు వేల మత్తకోకిలలు, ఆరువందల గీతాలు, యెనిమిది మంజరులు, వీరభద్రవిజయం , శరభలీల అనే కావ్యాలు, ముప్పై ఆరు గద్యాలు, ముప్పై ఆరు ఉభయశతకాలు చెప్పాడని కన్నడ కవి సిద్ధనంజేశుడు తన గురురాజచరిత్రలో చెప్పాడు.

రంగనాథుడు తన శ్రీగిరినాథ విక్రమమన్న గ్రంథాన్ని సంస్కృతంలోకీ అనువాదం చేసాడట. ఇవి మనకి అందుబాటులో లేవు.  దొరుకుతున్న కవితలలో కొన్నిటిని ఇక్కడ ఉటంకిస్తున్నాను -

1

చెలువార గజాజినచేలముతో
గళనీలిమతో నహికంకణుడై
తలఁజంద్రకళం గల దైవము మా
కులదైవము దైవతకోటులలోన్.

అందంగా ఏనుగు చర్మంతోటి, కంఠం మీద నలుపుతోటి, పాములని కంకణాలుగా ధరించి, శిరసుమీద చంద్రకళని ఉంచుకున్న దైవము కోట్లాది దేవతలలో మా కులదైవము.

2

ఉపవాసములెల్లను నుండుట నీ
కృప వచ్చుటకా యది రిత్త సుమీ
యపవిత్రుని౯ బుల్లని యంబలికై
సుపవిత్రుని౯ జేయుట సుద్ది గదే.

శివా, ఉపవాసాదికం చేయడం నీ కృపకోసం అనడం వొట్టిమాట. అపవిత్రుడిని పుల్లని గంజికోసం సుపవిత్రుడిని చేయడం వృత్తాంతమే కదా.

3

అదలని తేరు తేరికిని నాదరుపై తగు విల్లు వింటికిం
గుదురగు నారి నారిపయి౯ గూన్కు శరంబు శరంబు బొడ్డునం
బొదలిన యంత యంతముఖముల్ నిజవాసములైన గుఱ్ఱముల్
చెదరక నీకునెట్టిపని సేయునయా గిరిజాధినాయకా.

'ఊ౯' అంటే ముందుకు కదలని రథం (భూమి), ఆ రథాన్నే ఆధారం చేసుకుని ఉన్న విల్లు (మేరుపర్వతం), ఆ వింటికి కుదురైన నారి (ఆది శేషుడు), ఆ నారిమీద శయనించే వాడు బాణం(విష్ణుమూర్తి), ఆ బాణానికి నాభిలో జనించినవాడు సారథి (బ్రహ్మ), ఆ సారథి ముఖాలు గుర్రాలు (వేదాలు) - ఓ గిరిజానాథా! అటువంటి వాటిని త్రిపురాలని చంపడానికి దగ్గర పెట్టుకున్నావే, అవి నేకేంపని చేసిపెడతాయి? (చేసి పెట్టాయంటే అది నీ మహత్త్వమే కానీ వాటి గొప్ప కాదు అని ధ్వని)

4

ఓజు చేముట్టక యొగ్గాన౯ బట్టక చక్కగా దివి౯ బాఱు చక్రములును
లాయాన౯ గట్టక లలి మే౯త పెట్టక వర్ణహీనంబైన వారువములు
తపనపెట్టక జీవితము కాసు ముట్టక సత్త్వసంపద౯ జూపు సారథియును
కడచీల౯ దట్టక ఘనముగా మెట్టక గంభీరసంపద౯ గలుగునిరుసు

గలిగి తనరారునరదంబుఁ గడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందుశేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గరుణావిధేయుడై మనుఁచు గాత.

యే శిల్పీ తయారు చేయని, ఒగ్గంలో పట్టని, చక్కగా ఆకాశంలో పరిగెత్తే చక్రాలు; గుర్రపుశాలలో కట్టకపోవడం చేత, ప్రేమగా మేత పెట్టకపోవడం వల్ల వివర్ణాలైన గుర్రాలు; యే మాత్రం ఆసక్తి లేకుండా, జీవితంలో ఒక్క కాసు కూడా ఆశించకుండా సత్త్వసంపద చూపే సారథి; ఇనుపశీలలో పట్టకుండా, అసలు నడవకుండా గంభీరమైన సంపద కలిగిన ఇరుసు - వీటితో కలిసి ఉన్న ఒకానొక రథాన్ని యెక్కి, త్రిపురాలనిగెలిచిన ఇందుశేఖరుడైన దేవదేవుడు మనలని కరుణతో రక్షించుగాక.

( 'మనల కరుణావిధేయుడై మనచుగాత' అన్న మకుటంతో మణిమంజరిలోనే శివస్తుతిచాటువులు కనపడుతున్నాయి. వాటిలో ముత్యంలాంటి ఒక పద్యాన్ని నేను ఇదివరకు పరిచయం చేసాను. అవన్నీ చక్రపాణి రంగనాథుడి కృతులేనా అన్నది ఆలోచించాల్సి ఉంది).

*

# 5

## చక్రపాణి రంగనాథుడు - 2

రగడ శివకవుల సొత్తు. ఈ ఛందోరూపం తెలుగునేలపై శివకవుల చేతులలో పడి యెన్ని వయ్యారాలు పోవాలో అన్నీ పోయింది. ఈ ఛందస్సు పద్యకవితలలోని ఆవృత్తి ధర్మాన్నీ, జానపదాలలోని సంగీత ధర్మాన్నీ తనలో కలుపుకున్న అతి తక్కువ ఛందస్సులలో ఒకటి. దేశీయ ఛందస్సులకున్న ఈ లక్షణమే శివకవులని ఆకర్షించిందనుకుంటాను. రగడ, ద్విపద

వంటి దేశీయ ఛందస్సులు కాస్త పాటల రూపం వైపు ఒగ్గినా, వీటి నిర్మాణానికి అనన్యసామాన్యమైన ధార కావాలి. తెలుగులో ఉన్న భారతభాగవతాది రచనలలో ధార అన్న లక్షణానికి కొన్నిచోటులలో తెంపు ఉంటుంది కానీ శైవకావ్యాలని చూసినప్పుడు యెక్కడా ఆగని ఈ ధార మన మనసులని ఆశ్చర్యంతో నింపివేస్తుంది. ఉదాహరణకి, పండితారాధ్య చరిత్ర అన్న గ్రంథం మొదలు నుంచి చివరిదాకా అల్లబడిన ఒకే ఒక అప్రతిహతమైన గంగాప్రవాహం. అన్ని వేల ద్విపద దళాలు ఒక్క చోటులో కూడా తెగకుండా ఒకే ధారతో రచించబడటానికి ఆ కవి మనసు ఇంకెంత గొప్పదై ఉండాలో అన్నది తలుచుకుంటే ఒళ్లు గగుర్పాటుకి లోనౌతుంది.

ముందు వ్యాసంలో చెప్పినట్లు, చక్రపాణి రంగనాథుడు విస్తారమైన శైవవాఙ్మయాన్ని సృజన చేసాడు. అతని కవిత్వంలోని తీపికి యెల్లలు లేవు. దొరికిన రచనలు లేశమాత్రమే అయినా, వాటిలోని లోతూ, బరువూ మన మనసుని తాకి ఉక్కిరిబిక్కిరి చేస్తాయి.

రంగనాథుడు వైష్ణవుడిగా పుట్టినవాడు. మనుషులకి సహజమైన పరపక్ష, స్వపక్షాల ద్వంద్వంలో తన చూపుని మలినపరుచుకున్నవాడు. తరువాత ఆ చూపుని పోగొట్టుకున్నవాడు. ఉచ్చనీచలనే చట్రంలో ఇరుక్కొని ఉన్నా, దైవాన్ని నమ్ముకున్న కారణంగా దాని నుంచి బయటపడగలిగాడు.

ఆ విషయాన్నే అతను ఇలా చెప్పుకొన్నాడు -

శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడనగుచుఁ బోవఁ బథమునఁ జక్షుల్
దీపించు దృష్టి తొలఁగిన
శ్రీపతినడుగంగఁ గర్త శివుడని చెప్పెన్.

నరసింహస్వామి బోధ జరగడమే రంగనాథుడికి తిరిగివచ్చిన స్వచ్ఛమైన చూపు. ఆ చూపు దొరకగానే అతడు మహాకవిగా పునర్జన్మ యెత్తాడు. ఆ చూపుతో అతను యెవరికీ సాధ్యపడని ఒక ఘనమైన అంతర్యుద్ధాన్ని జయించాడు.ఆ గుణపాఠం, ఆ అహంకారసంబంధితమైన వాదపరాజయం, ఆ భౌతిక సంబంధమైన దృష్టిహాని అతనికే తెలియకుండా ఆయుధాలై అతనికి సాయపడ్డాయి. ద్వంద్వబుద్ధి పోయింది. ఒకే శివస్వరూపం అతని ముందు పొరలుకట్టి

పరుచుకుంది. దానితో అంతకు ముందు లేని ఒక దివ్యమైన ధార అతని బుద్ధిలో ఊపిరి తీసుకుంది. కవిత్వం పొంగి వచ్చింది.

చూపు తిరిగివచ్చిన దివ్యానుభూతిలో మునిగిన రంగనాథుడు తెలుగు సాహిత్యంలోనే ఒక అమూల్యమైన రగడకి ప్రాణం పోసాడు. దీనికి నయన రగడ అని పేరు. శివభక్తిదీపిక అని నామాంతరం. ఈ రగడలోని వస్తువు ఆతని చూపే. అతను కనుగొన్నటువంటి శ్రీశైలశిఖరంపై వెలసిన దివ్యత్వానికి ఒక రూపాన్ని ఇచ్చిన రచన ఇది. దీనిలోని ధార, మధురిమ, యెరుక లాంటి లక్షణాలు చాలా అరుదుగా దొరికేవి. ఈ రచనలో ప్రతీ పాదంలోనూ నాలుగు పంచమాత్రల గణాలు ఉంటాయి. 'కంటి ' అన్న పదం అంత్యప్రాసలో వస్తుంది. మనకి దొరుకుతున్నంత వరకూ ఈ రగడ చూచాయగా మూడువందలయాభై పంక్తులతో ఉంది.కొన్ని పంక్తులు లుప్తమయ్యాయనడానికి గుర్తుగా ఖాళీలు కనిపిస్తున్నాయి.

మొత్తం రచనలో అందమైన పంక్తులని యేరడం కష్టమైనా, ఇబ్బంది పడుతూనే కొన్నిటిని ఇక్కడ చూపుతున్నాను -

శ్రీశైలశివవర్ణన చేసిన పంక్తులు -

శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీ పురాధీశు గౌరీశుఁ బొడగంటి
సర్వలోకేశ్వరుని సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబుఁ బొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి
పరమ యోగీంద్ర హృత్పదనిలయుఁ బొడగంటి
చంద్రార్క శతకోటి సంకాశుఁ బొడగంటి
చంద్రార్క శిఖినేత్రు శంకరునిఁ బొడగంటి
రూపింపఁ బ్రకటస్వరూపంబుఁ బొడగంటి
నాపరంజ్యోతియై యమరుదేవునిఁ గంటి
వేదంబు లీశ్వరుని వినుతింపఁ బొడగంటి
నాదిదేవుఁడు రుద్రుఁడని శ్రుతులఁ బొడగంటి

(శ్రీశైల శిఖరాన్ని చూసాను. కాశీపురాధీశుడైన గౌరీపతిని చూసాను. పరమాత్ముడైన, యోగుల హృదయాలలో నివాసముండే, కొన్నికోట్ల సూర్యచంద్రులకాంతితో సమానమైన, పరంజ్యోతియైన ఆ అమరదేవుడిని చూసాను. వేదాలు పొగడేది ఆ ఈశ్వరుడినే అని చూసాను. ఆదిదేవుడు రుద్రుడని వేదాలు చెప్పడం చూసాను.)

భక్తి మహిమని మనోహరంగా వర్ణిస్తున్నాడు -

భక్తు లప్రతిహత ప్రధితమతులని కంటి
భక్తులకుఁ బ్రత్యర్థి పరులు లేరని కంటి
భక్తులకు నెందు నాపదలు లేవని కంటి
భక్తులాపదలచేఁ బట్టువడరని కంటి
భక్తు లహి కేయూర పదబద్ధులని కంటి
భక్తులతి నిర్వాణ పదసిద్ధులని కంటి
భక్తులు జగత్ప్రాణ పదలోలు రని కంటి
భక్తులు సదానంద పదశీలురని కంటి
భక్తు లేపదవులును బడయ నొల్లమిఁ గంటి
భక్తులకు నేరుచుల్ భక్తిఁ బోలమిఁ గంటి
భక్తులద్భుత కర్మ పారీణులని కంటి
భక్తులద్భుత పుణ్య ఫలభాగులని కంటి
భక్తుల కుమాభర్త ప్రాణంబులని కంటి
భక్తులుద్భట దోషభవ ముక్తులని కంటి

(భక్తులు అడ్డులేని గొప్ప బుద్ధికలవారని చూసాను (తెలుసుకున్నాను). భక్తులకి తనవారు, ప్రత్యర్థులు లేరనీ, భక్తులకి ఆపదలు లేవని, భక్తులు ముక్తిసుఖాన్ని అనుభవించేవారనీ, భక్తులు సదానందులనీ, భక్తులు పదవులమీద అనాసక్తులనీ, భక్తులు కర్మపారీణులనీ, భక్తులు గొప్ప పుణ్యఫలాన్ని కలిగినవారనీ, భక్తులకు ఉమాభర్త పంచప్రాణాలనీ, భక్తులు దోషాలనుండి విముక్తులనీ చూసాను)

శివరూపవర్ణన ఇది-

సోమ ఖండాఖండ జూటంబుఁ బొడగంటి
భరిత నయనాభీల భాలంబుఁ బొడగంటి

సురచిర స్ఫుటజైత్ర శూలంబుఁ బొడగంటి
క్రతుహరుని శుద్ధ కంకాళంబుఁ బొడగంటి
జిత గజాజిన మహాచేలంబుఁ బొడగంటి
గురుమౌళి సురసరిత్కూలంబుఁ బొడగంటి
గిరిసుతా తనుభాగకీలంబుఁ బొడగంటి
నతిసుందరాకార మాది వృషభునిఁ గంటి
హరినేత్ర పూజితుని నాదిమూలముఁ గంటిఁ

(నెలరాజు తునకతో ఉన్న అఖండమైన జటాజూటాన్ని చూసాను. భయంకరమైన అగ్నితో ఉన్న నొసలునీ, మనోజ్ఞమైన త్రిశూలాన్నీ, కంకాళాలనీ, యేనుగుతోలునీ, గంగానదినీ, పార్వతీ దేవి ఉన్న వామభాగాన్నీ, సుందరుడైన నందినీ, విబూది పూసిన శరీరభాగాలనీ చూసాను. రాముడి నేత్రంతో పూజనందుకున్న ఆదిమూలాన్ని చూసాను)

ఈ క్రిందిదళాలు ఈ రగడకే మకుటాయమానమైనవి. అతనిలోని స్వయంపరిశోధనని చెబుతున్నాడు -

బరికింప నాలోని పాపంబు కడగంటి
నరసి పాపము నన్ను నంటరాదని కంటి
బహుపాపధరుఁ డేల భక్తుఁడౌనని కంటి
బహుపాపములు నన్నుఁ బట్టి విడుచుటఁ గంటి
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి
భయభక్తులీ భర్గు పాదములు పొడగంటి
నిది పుణ్యమని కంటి నిది గణ్యమని కంటి
నిది యోగమని కంటి నిది భోగమని కంటి
నిది ధర్మమని కంటి నిది మర్మమని కంటి
నిది నిత్యమని కంటి నిది సత్యమని కంటి
నిది పుణ్యములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది గణ్యములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది యోగములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది భోగములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది ధర్మములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది మర్మములకెల్ల నెక్కుడని పొడగంటి

నిది నిత్యములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది సత్యములకెల్ల నెక్కుడని పొడగంటిఁ

(ఆత్మవిమర్శ చేయగా నాలోని పాపాన్ని చూసాను.ఆలోచించి నన్ను పాపం అంటకూడదన్నది చూసాను. పాపాలని ధరించేవాడు భక్తుడు కాడన్నది చూసాను. నన్ను బహుపాపాలు పట్టుకుని విడవడమూ చూసాను. ఈ భయభక్తులు మృదువుగా నాకు నయనాలనివ్వడం చూసాను. నా ధనమైన భర్గుడి పాదాలని చూసాను. ఇదే పుణ్యమనీ, ఇదే గణ్యమనీ, ఇదే యోగమనీ, భోగమనీ; ఇదే ధర్మమనీ, మర్మమనీ; ఇదే నిత్యమనీ సత్యమనీ చూసాను. ఇది పుణ్యాలలోకెల్లా గొప్పదని చూసాను. ఇదే గణ్యాలలోకెల్లా గొప్పదనీ, ఇదే యోగాలలోకెల్లా గొప్పదనీ, భోగాలలోకెల్లా గొప్పభోగమనీ, ధర్మాలలోకెల్లా గొప్పధర్మమనీ, మర్మాలలోనూ గొప్పమర్మమనీ, నిత్యవస్తువులలోకెల్లా నిత్యమైనదనీ, సత్యములన్నిటిలోనూ మహాసత్యమనీ చూసాను).

తనకి ద్యోతకమైన తాను చేయాల్సిన పనిని ఇలా చెబుతున్నాడు -

శంకరుని కృప వడయ సమయమిది యని కంటి
నిఁకను నాయెత్తు కృతులిత్తునని పొడగంటి
నిఁకఁ గృతుల్ చెప్ప నా కేమిభయమని కంటి
వడిఁ గృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
మృడుఁడింక నాకృతుల్ మెచ్చునని పొడగంటిఁ

(శివుని కృపపొందడానికి ఇదే సమయమని చూసాను. ఇక నాయెత్తు కృతులని రచిస్తానన్నది చూసాను. రచనలు చేయడానికి నాకేమిటి భయమన్నది చూసాను. నా రచనలన్నీ నా అంత యెత్తు వస్తాయన్నది చూసాను. మృడుడు నా రచనలు మెచ్చుకుంటాడన్నది చూసాను)

రంగనాథుడు అన్నట్లుగానే తనంత యెత్తు రచనలు శివునిపై చేసి తన జన్మకి సార్థకత యేర్పరుచుకున్నాడు. ఈ మహాశివకవి సరస్వతిని మొత్తంగా చూడలేకపోవడం మన దురదృష్టమే.

*

# 6

## శైవశతకరత్నాలు

తెలుగు చాటుసాహిత్యంలోని శైవకవితలు నా మనసుని మహదానందంలో ముంచివేసాయి. శివభక్తి, శరణాగతి వంటి ఉత్తమగుణాలతో పాటు ప్రాకృతసాహిత్యంలో మాత్రమే దొరికే దగ్గరితనం, దేశీయత తెలుగులో శైవసాహిత్యంలో నాకు దొరికింది.

శివయుగంలోని కవులు మొదట తెలుగు వాళ్లు, తరువాత శైవులేమో అనిపిస్తుంది. వాళ్ల మనసు తెలుగు. భక్తి తెలుగు. శరణాగతి తెలుగు. వ్యక్తీకరణ తెలుగు. వారి దైవమైన శివుడు తెలుగు. అందుకేనేమో వీళ్ల కవితలలోని తీపిని రుచిచూసి ఉత్తరదిగగ్రాన హిమాద్రితుంగశృంగాలలో తిరుగాడే శివుడు సకుటుంబంగా తెలుగు నేలమీదకి వచ్చాడు. వెనుకకి వెళ్లనని ఇక్కడే శాశ్వతంగా ప్రాణప్రతిష్ఠ చేసుకున్నాడు. ఆయన శిరసుమీద ఉండే గంగలోని పరవళ్లు, చంద్రుడిలోని చల్లతనం, నొసలు మీద ఉన్న నిప్పులోని పవిత్రత, డమరులోని శబ్దసౌందర్యం, త్రిశూలంలోని వంపులు, పార్వతిలోని ప్రకృతి, జింకలోని తుళ్లింతలు, యేనుగులోని ఠీవి అన్నీ ఆయనకి శివకవుల తెలుగులో దొరికాయి.

వేటూరి వారు చాటుపద్యమణిమంజరిలో కొన్ని శైవశతకాలలోని పద్యాలని శతకరత్నాలు అన్న శీర్షికన ఉంచారు. వాటిలోని కొన్ని పద్యాలని ఇక్కడ చూపుతున్నాను.

1

కరులు హరుల్ చమూవరులు గాటపు మేల్నగరుల్ కడాని బం
గరులు సరుల్ తలోదరులు గంధమిలన్మృగనాభిచందనా
గరులు విరుల్ జగాసిరులు గల్గి సుఖింత్రు త్వదీయులౌ నరుల్
చిరవిభవా! భవా! విజితచిత్తభవా! యభవా! మహాభవా!

శివా! యేనుగులు, గుర్రాలు, పరివారజనం, పెద్దపెద్ద పట్టణాలూ, అపరంజి బంగారపు హారాలూ, మోహనాంగులూ, సుగంధాలని వెదజల్లే చందనాగరులూ, పూవులూ, సకల సంపదలూ కలిగి నీ వాళ్లైన వారందరూ సుఖిస్తారు.

శివభక్తులు ముక్తి సుఖంతో పాటుగా లౌకిక సుఖాలనీ పొందుతారని కవ్యుక్తి. ఇక్కడ ముఖ్యమైన మాట 'త్వదీయులు ' అన్నది. అంటే శివుడివాళ్లవడమన్నది. ఇదే కుచేలుడు అనుభవించిన స్థితి. యే మాత్రమూ లౌకిక సుఖానుభవం లేకముందే అతను కృష్ణుడివాడైయాడు. అతనికి అపేక్ష లేకపోయినా, వాటంతటవే సకలభోగాలూ కుచేలుడిని అనుసరించాయి.

ఈ పద్యం మకుటం చాలా అందమైనది. చిరవిభవా అన్నది మొదటి మాట. ఈ మాటకు అర్థం చిరకాలం సంపద కలవాడని. అందుచేత తనవాళ్లకు భోగభాగ్యాలనీయగల సమర్థుడు. రెండవమాట భవా అని. అంటే పుట్టుక లేదా సంసారం తానైన వాడు. విశ్వవ్యాపకుడు. తరువాత కవి విజితచిత్తభవా అన్నాడు. అంటే మన్మథుడిని జయించినవాడని. తరువాత అభవా, మహాభవా అన్న మాటలకు పుట్టుక లేనివాడనీ, అతిపెద్దపుట్టుక కలవాడనీ అర్థాలు. ఆది లేని లేని వాడై ప్రతిక్షణమూ పుడుతున్న అన్ని పుట్టుకలకీ మూలమైన వాడు ఈ పాదానికి మధురమైన అన్వయం చెప్పవచ్చు. శివభక్తి మనసులో రాజుకుంటే ఆయనే సకలభోగాలనూ ఇచ్చి, తన విశ్వవ్యాపకమైన నిజస్వరూపాన్ని పరిచయం చేస్తాడు. తరువాత మనసులో జనించే కోరికలని జయింపచేస్తాడు. తరువాత పుట్టుక లేనితనమూ, సర్వం వ్యాపించిన పుట్టుకతనమూ తానే అనే మహాజ్ఞానాన్ని కలుగజేస్తాడు.

నేను చూసిన మణిమంజరి ముద్రణలో ఈ పద్యం క్రింద ధూర్జటిగారి శతకము అని వేటూరి వారు వ్రాసినట్లు ఉంది. అయితే ఇది కూచిమంచి తిమ్మకవి వ్రాసిన చిరవిభవశతకంలోనిది. తరువాతి ముద్రణలో వారే దీనిని సరిచేసి ఉండవచ్చు.

2

లోకములెల్ల నీతనువులోనివ నీవట యెంతగల్గుదో
నాకపపద్మసంభవజనార్దనులాదిగ నెల్లవారలన్
నీకొలఁదింతయంత యననేరక మ్రొక్కఁ దొడంగి రన్న ని
న్నే కరణిన్ నుతింతుఁ బరమేశ్వర! శ్రీగిరిమల్లికార్జునా!

శ్రీశైలశివా! ఈ లోకాలన్నీ నీ శరీరంలోనివే. నీవు ఎంతటివాడవో! ఎప్పటివాడవో! నీవు ఇంతవాడివనీ అంతవాడివనీ అనలేక ఇంద్రుడు, బ్రహ్మదేవుడు, విష్ణుమూర్తి మొదలైన దేవతలంతా నీకు నమస్కారాలు చేస్తారంటే నేను నిన్నేవిధంగా స్తుతి చేయగలను?!

ఈ పద్యం పండితారాధ్యులు చేసిన శివతత్త్వసారమన్న కృతిలోది.

3

ధరలో నుద్ధురలోభులన్ ధనముచింతం గాంచి కాసంత పే
సరితిం గేసరి తీవ్రరోగహతి నష్టంబైనరీతిన్ మదు
ద్ధరణం బాదరణంబునన్నిలుపవే తాపత్రయాగ్నిస్ఫుర
ద్గరిమార్చిన్ బరిమార్చి భక్తసులభా గౌరీమనోవల్లభా.

ఈ భూమిమీద ధనం మీదనే తమ ఆలోచనలన్నీ చేసి చివరకి పెద్ద సింహం రోగానపడి దెబ్బతిన్నట్టు తినడం చూసి వేసారాను. అంచేత గౌరీవల్లభా! తాపత్రయాగ్ని కీలలని నాశనం చేసి నన్ను ఉద్ధరించడమనే పనిని మన్నింపుగా నిలుపుకో.

ఈ పద్యం గౌరీమనోవల్లభ శతకంలోనిది.

4

సాగిన కోపవహ్ని నిజశాంతిజలంబునఁ జల్లనార్చి యా
శాగిరులన్ నివృత్తికులిశాహతి నుగ్గుగఁ జేసి యత్తమో
నాగవిభున్ వివేకమృగనాయకుచే నణగించి లోన సం
యోగవియోగముల్ విడువ యోగియగున్ వటమూలమందిరా!

వటమూలాన్ని మందిరంగా చేసుకున్న దక్షిణామూర్తీ! మనసులో రేగిన కోపమన్న నిప్పుని తన శాంతిజలాలచేత చల్లార్చి, ఆశా పర్వతాలని ముముక్ష అనే వజ్రాయుధపు దెబ్బతో నుగ్గునుగ్గు చేసి, అజ్ఞానమనే ఏనుగుని వివేకమన్న సింహంతో అణగగొట్టి, అంతరాళములో సంయోగవియోగాలని విడిచినవాడే యోగి అనబడతాడు.

5

వాలిన యింద్రియంపుఁ బెనువాతులకున్ మృదుగానమంద వా
తూల విలాసినీ కుసుమ తోయగుణంబులు వచ్చి చొచ్చినన్
గ్రోలఁగనీక నెమ్మనము కుత్తుక పట్టి నినుం దలంచి యీఁ
జాలిన గాక మాటలఁ బ్రసాదములే వటమూల మందిరా.

వటమూలమందిరా! మీద పడిన ఇంద్రియాలనే పెద్దపెద్ద గాలులకి మృదువైన సంగీతాలూ పిల్ల గాలులతో, విలాసినులు, పూవులు, పన్నీరులు వంటివి యెగురుతూ వచ్చి మీదపడితే వాటిని గ్రోలకుండా నా మనసు కుత్తుకని పట్టి, నిన్ను స్మరించి నీకు అర్పించగలగాలి కానీ, మిగిలినవన్నీ కేవలం తీపి మాటలే.

ఈ రెండు పద్యాలూ 'వటమూలమందిరా' అన్న కవితలోనివి. ఈ కవిత సంస్కృతంలోని దక్షిణామూర్తి స్తోత్రానికి దీటు. వ్యాఖ్యకి సరిపోనన్న చిన్నతనంతో  భావం అందించి విడిచిపెడుతున్నాను.

ఈ వ్యాసంతో చాటుపద్యమణిమంజరిలోని శైవకవిత్వంతో నా ప్రయాణం ముగిసింది.

*

# 7

# జనార్దనాష్టకము

కందుకూరి రుద్రకవి పదహారవ శతాబ్దంలోని తెలుగు కవి. కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్నాడని కొంతమంది అంటారు. తన జీవితంలో సుగ్రీవవిజయమనే యక్షగానం, నిరంకుశోపాఖ్యానం వంటి గ్రంథాలు రచన చేసాడు. కానీ ఇతనిలోని మహాకవి బయటకి వచ్చింది ఒక యెనిమిది పద్యాల నిడివి ఉన్న ఒక కవితలో.

ఈ రచనకి జనార్దనాష్టకమని పేరు. దీనిని చాటుపద్యమణిమంజరిలో వేటూరి వారు ఉటంకించారు. ఈ కవిత యెన్ని పొరలతో అల్లబడిందంటే, భక్తిసుఖంతోనూ, తెలుగుభాషతోనూ

కాస్త పరిచయమున్న వారినెవరినైనా చప్పున తనలోకి లాగుకొంటుంది. దీనిని వ్రాయించుకున్నది ప్రకాశం జిల్లా కందుకూరులో కొలువున్న జనార్ధనుడు.

శైవం పండుతూ జ్ఞానంలోకీ, వైష్ణవం పండుతూ ప్రేమ లోకీ మనిషిని లాగుతాయి. ప్రేమ అనే వస్తువు నిజస్వరూపం తెలుసుకోడానికి, దాని చుట్టూ అల్లుకొన్న విరహం, కామం, కోపం, ఉత్కంఠత, భీరుత లాంటి మనోభావాల రూపం ఉన్నది ఉనట్లు తెలుసుకోడానికీ, వాటిలోని దివ్యసుఖాన్ని ఆకళింపు చేసుకోడానికి భాగవతుల జీవితాలే మనకి సహాయపడేవి.

ప్రేమ, అది కలిగించే సుఖం - అనే విషయాలలో మనిషికి రకరకాల స్థాయిలలో అనుభూతులు కలుగుతున్నాయి. ప్రేమలో ఉన్నప్పుడు ఒక చోట దొరికే మధురిమ ఇంకొక చోటులో దొరకకపోవడానికీ, ఒక చోటులో దొరికినదానికంటే వేరే చోటులో ఇతోధికంగా దొరకడానికీ, సమయాన్ని బట్టి ఒక చోటుని మించి వేరే చోటులో రూపందుకోవడానికీ కారణం ప్రేమ కాదు. మనం ప్రేమలో ఉండి ఉపాసించే వస్తువు. కనుక, మల్లగుల్లాలు పడుతూ మనిషి 'ప్రేమ' ని నిర్వచించవలసిన అవసరం లేదు. అది సహజంగానే తీపి సముద్రం. నిర్వచించవలసింది మనం ప్రేమిస్తున్న వస్తువుని. వస్తువు జంతువైతే మన అనుభూతిలోకి జంతుప్రేమ వస్తుంది. మనిషైతే మానవప్రేమ అవగతమౌతుంది.
అదే వస్తువు దివ్యమైతే, దివ్యప్రేమ మనలని ముంచివేస్తుంది. ఆ వస్తువుని బట్టే, ప్రేమకి సహాయరూపాలైన కామం, విరహం లాంటి వాటి స్వరూపస్వభావాలూ తదనుగుణంగా మారిపోతాయి.

ఈ దివ్యప్రేమని దైనందిన జీవితాలలోకి దింపి, తమ జీవలక్షణంలో సుగంధవాసనగా మలచికొని, ఆ సుఖంలో విశ్వాన్ని మరిచిపోయిన వాళ్ళు విష్ణుభక్తులు. ప్రేమ రహస్యాలకి వాళ్ల జీవితాలే నివాసస్థానాలు. వారి ప్రేమ దివ్యమైనది. వారి శృంగారం దివ్యమైనది. వారి విరహం దివ్యమైనది. వారు హృదయంతో అర్పించే అరటిపండు తోలూ, తులసి ఆకూ, అటుకులూ, మూడడుగులూ, పూలదండా, చెప్పే మాటా, పాడే పాటా, చేసే యుద్ధమూ అన్నీ దివ్యమైనవే.

అటువంటి దివ్యశృంగారాన్ని వర్ణిస్తూ చేసిన కృతి ఈ జనార్ధనాష్టకం. ఇందులో ఒక్కొక పద్యం అష్టవిధనాయికలలో ఒక్కొక నాయికకు ప్రతీక. ఈ కవిత ఛందస్సు సొగసైన లయతో ఉంటుంది. మత్తకోకిలకి దగ్గరైన రూపం. యతి ప్రాసలతోటి రుద్రకవి దీనిని ఉత్కృష్టమైన రచనగా మలిచాడు. నాయకుడు విష్ణువు కావడం మూలాన నాయిక అనుభవించే దివ్యప్రేమలో, సాధారణంగా ఒక ప్రియుడు వచ్చినా, రాకున్నా ఒక స్త్రీ పొందే అనుకూల ప్రతికూల వికారాలకు తావుండదు. అర్పణ మాత్రమే కనిపిస్తుంది.

ఈ కవిత చెబుతున్నది దేవదాసి కావడం వల్లా, తన ప్రియుడు భగవంతుడు కావడం వల్లా, ఆమె అనుభవించే శృంగారవైకల్యంలో స్థాయి పెరిగి, ఆమె మానవసహజమైన తన పరిస్థితిని అతిశయించి భగవత్ప్రేమను ముందుకు వచ్చినట్లు తోస్తుంది. ఈ రచనని సంపూర్ణంగా మానవశృంగారనాయికాస్వభావాలతో సరిపోల్చలేము

~

స్వాధీన పతిక -

సిరులు మించిన పసిమిబంగరు జిలుగుదుప్పటి జారఁగా
చరణపద్మముమీఁద, దేహము చంద్రకాంతులు దేరఁగా
మురువుచూపఁగ వచ్చినావో మోహనాకృతి మీరఁగా
గరుడవాహన! దనుజమర్దన! కందుకూరి జనార్దనా.

(పాదాల పైన సిరులు మీరే బంగారు జిలుగుల దుప్పటీ జారుతుండగా, శరీరం చంద్రకాంతిలో కనిపిస్తుండగా, నీ మోహనాకృతి మీరగా సుందరతని చూపడానికి వచ్చావా స్వామీ! )

ఈమె భర్తని వశంలో ఉంచుకున్న వనిత. సాధారణంగా ప్రియుడితో గాజులు సవరించుకోవడం, తిలకం దిద్దించుకోవడం వంటి పనులు చేయించుకున్నట్లుగా చిత్రిస్తారు ఈమెను. కానీ భక్తురాలికి దగ్గరకి స్వామి రావడమే స్వాధీనపడటం. అదే మహదానందం. దాని సూచకంగా అంతా ఆయన వర్ణనే ఉంది కానీ ఈమె ఆధిక్యత లేదు ఈ పద్యంలో.

~

విప్రలబ్ధ -

ఆనపెట్టిన రాకపోతివి ఆయెబో అటుమొన్ననూ
పూనిపిలువఁగ వినకపోతివి పొంచిపోవుచు మొన్ననూ
నేనుచూడగ గడచిపోతివి నీటుచేసుక నిన్ననూ
కానిలేరా! దనుజమర్దన! కందుకూరిజనార్దనా!

(స్వామీ! అటుమొన్న వస్తానని ఒట్టేయించుకుని రాలేదు నువ్వు. మొన్న యెంతో తాపత్రయంతో పిలిచినా వినకుండా పక్కనుంచి తప్పించుకుని పోయావు. నిన్న నా యెదురుగుండానే నడుస్తూ నా దగ్గరకి రాకుండా వెళ్లావు. సరే కానీలే. )

విప్రలబ్ధ మోసగించబడిన నాయిక. అనుకున్న చోటుకి ప్రియుడు రాకపోయేసరికి కోపంతో తన అభరణాలనూ, గది అలంకరణలనూ విసిరివేస్తూ కోపగించుకునే స్త్రీ. ఇక్కడి నాయికకు అహంకారజనితమైన కోపం స్వామి మీద ఇసుమంతైనా లేదు. ఆమె నిస్సహాయతను, 'వచ్చినా రాకున్నా నీ యిష్ట ' మనేటంత మహోన్నతమైన ప్రేమనూ తీయగా కవి 'కాని లేరా!' అన్న పదంలో పెట్టాడు.

~

విరహోత్కంఠిత -

నిన్నరాతిరి చవికలోపల నీవు చెలి కూడుంటిరా
ఉన్నమార్గములన్నియును నే నొకతెచేతను వింటిరా
విన్నమాత్రము గాదురా నిను వీథిలో కనుఁగొంటిరా
కన్నులారా దనుజమర్దన కందుకూరిజనార్దనా!

(స్వామీ! నిన్న రాత్రి నీవు చావిడిలో ఒక అమ్మాయితో కలిసి ఉన్న విధాలన్నీ నేను ఒకతె చెబితే విన్నాను. వినడమే కాదు, నా కళ్లారా నిను వీధిలో వెడుతుంటే చూసాను. )

ఈ నాయిక ప్రియుడి కోసం ఎదురుచూస్తూ, కారణాంతరాలవల్ల ప్రియుడు తన దగ్గరకి రానప్పుడు విరహంతో బాధపడే స్త్రీ. ఆ స్థితిని ఒక భక్తురాలు భగవంతుడిపైన చూపించడానికి కవి యెంచుకున్న విధానం ఎంతో గొప్పది. ఆమె నిజానికి 'నన్ను విరహంలో ఉంచావు ' అని స్వామిని దెప్పి పొడవడం లేదు. 'నేను తప్ప నీకు వేరే పెద్ద పని ఏమిటి ' అని అహంకారాన్ని ప్రదర్శించడంలేదు. కేవలం 'నిన్ను వేరే అమ్మాయితో ఉండటం వేరే యెవరో చెబితే విన్నాను. విన్నానని నేను విన్నది అబద్ధమంటావేమో, నేను కూడా నిన్ను చూసాను ' అని మాత్రమే అనిపించి, 'స్వామీ, నీవు సర్వసమర్థుడివి. నీవు వస్తే నాకు యెడతెగని ఆనందం, వచ్చేటంతవరకూ యెదురుచూడటమే నేను చేసేది ' అన్న శరణాగతిని చూపించాడు.

~

అభిసారిక -

దబ్బులన్నియు తెలుసుకొంటిని తప్పుబాసలు సేయకూ

మబ్బుదేరెడికన్నుగవతో మాటిమాటికి డాయకూ
ఉబ్బుచేసుక తత్తరంబున నొడలిపై చెయివేయకూ
గబ్బితనమున దనుజమర్దన! కందుకూరిజనార్దనా

(స్వామీ! మాతలన్నీ తెలుసుకున్నాను, నా దగ్గర అబద్ధపు బాసలు చెయ్యకు. మాటిమాటికీ మబ్బుతేరే కళ్లతో నన్ను సమీపించకు. తత్తరపాటుగా నా మీద చేయి వేయకు!)

ఈమె ప్రియుడి చోటుకి తానే వెళ్ళే నాయిక. ఈమె ఎన్నో అడ్డంకులను అధిగమించి ప్రియుడిని చేరుకుంటుంది. అయితే భక్తురాలయిన ఈ పద్యంలోని నాయికకు  అడ్డంకులు దాటేనన్న అహంకారం లేదు. స్వామిని చేరుకున్నాక పదునాలుగు లోకాలని యెల్లవేళ్లలా యేలే ఆయన తన దగ్గరకి వస్తే తను ఆగగలదా? తట్టుకోగలదా? స్వామి రాలేదన్న బాధ పేరు. వచ్చాక తన సంగతి? ఆ భయమే ఈ భక్తురాలి హృదయం. సాధారణంగా ఈమెను యెన్నో కష్టాలకోర్చి ప్రియుడి దగ్గరకి వెళ్లినట్లు చూపుతారు. ఇక్కడ వాటి ఊసే లేదు. ఆమె శరణాగతి, ప్రేమ తప్ప.

~

ఖండిత -

బిత్తరమున మొలకకెంపులు పెదవిసెవ్వతె ఉంచెరా
గుత్తమైనమిటారి గుబ్బల గుమ్మ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను చెక్కిలెవ్వతె నొక్కెరా
కత్తిగోరుల దనుజమర్దన కందుకూరి జనార్దనా!

(జనార్దనా! నీ పెదవి మీద యెర్రదనాన్ని అద్దినదెవరు? వక్షఃస్థలంపైన కుంకుమని అలదిందెవరు? కత్తిగోరులతో గీరుకునే విధంగా చెక్కిలిని నొక్కినదెవరు? )

ఈమె ప్రియుడు వేరే స్త్రీతో కలిసాడని కోపగించుకునే నాయిక. అంచేత ప్రియుడితో గొడవకి దిగుతుంది. అందుకు విరుద్ధంగా ఈ కవితలో బేలతనపు ప్రశ్నలైతే ఉన్నాయి కానీ, స్వామి సర్వసమర్థతని ప్రశ్నించడం లేదు. 'నన్ను విడిచి వేరు చోటికి వెళ్లావే' అన్న బాధ తప్ప ఒక్క అహంకారపూరితమైన వాక్కు లేదు. కేవలం తన గమనింపులనే చెప్పింది కానీ,వేరు మాట మాట్లాడలేదు. తన మనసుని అర్పించుకున్న భగవంతుడితో అహంకారంగా తగువు పడటం ఈమెకి రాదు.

~

కలహాంతరిత -

అండబాయక కూడియుంటివి ఆయె బోయెను నాటికీ
ఖండి మండిపడంగ నేటికి కదలు మెప్పటిచోటికీ
ఉండరా నీమాటలకు నే నోర్వఃజాలను మాటికీ
గండిదొంగవు దనుజమర్దన! కందుకూరి జనార్దనా.

(నన్ను విడవకుండా నీవు నాతో ఉన్న రోజు వచ్చి వెళ్లిపోయింది. ఇప్పుడు మండిపడితే నాకు కలిగే ప్రయోజనమేమిటి? ఎప్పుడూ ఉండే ఆ చోటుకి కదులు. స్వామీ, ఉండరాదా? నీ మాటలకి నేను తాళలేను. నువ్వు ఇంటిదొంగవి!)

ఈమె కోపంతో ప్రియుడిని వదిలి, తరవాత ఖిన్నపడే నాయిక. ఈ పద్యంలో స్వామి తనను చేరి వీడితే, ఆమె  - నన్ను 'అండబాయక కూడియుంటివి ' కానీ, ఆరోజు 'ఆయెబోయెను' అని దుఃఖపడింది. మళ్లీ తేరుకొని, 'నిన్ను వదులుకున్నానని ఇప్పుడు నామీద నేనే మండిపడితే నిన్ను మళ్లీ చేరగలనా? అందుకని స్వామీ, నీవు 'యెప్పటి చోటుకి కదులు' అంటూంది. యెంత అందమైన భావన ఇది! మూడవ పాదంలో, తనను విడిచి వెళ్లిన వాడిని 'ఉండరా' అని నిస్సహాయతతో అనడంలో ఆమె మనసులో పొంగుతున్న కొన్ని వేల భావాలను మన ముందు పెట్టాడు కవి.
~

ప్రోషిత భర్తృక -

అలుకలన్నియు దీర నివు నా అండకెప్పుడువస్తివీ
పిలిచి నవరత్నాలసొమ్ములు ప్రేమతో నెపుడిస్తివీ
వలచి వలపించియును గూరిమి వదలకెప్పుడు మెస్తివీ
కలసి వేడుక దనుజమర్దన! కందుకూరి జనార్దనా.

(స్వామీ! నా కోపాన్ని తీరుస్తూ నువ్వు నా దగ్గరకి ఎపుడైనా వచ్చావా? నన్ను దగ్గరకి పిలిచి ప్రేమతో సొమ్ములేవైనా ఇచ్చావా? నన్ను ప్రేమించి, నిన్ను కలిసి వేడుకగా ప్రేమించేలా చేసుకుని వదలకుండా ఎపుడైన మెచ్చావా?)

ఈ నాయిక ప్రియుడు దేశాంతరం వెళ్లాడని బాధపడేది. తన దగ్గరగా లేని భగవంతుడి దగ్గర మనసుని అర్పించిన ఈ నాయిక చేత తనను తన స్వామి చేరాలనీ, యెలుకోవాలనీ తన మనసులో ఉన్న భావాలని గోముగా ప్రశ్నల రూపంలోనే అడిగించాడు  కవి.

~

వాసకసజ్జిక -

జంట నేత్రము లంటి చూచితె జాజిపూవులు పూసెరా
మింటిత్రోవను జూచుచుండగ మేఘవర్ణము గప్పెరా
కంటిలో నొక పండు వెన్నెల కాయుచున్నది యేమిరా
కంటిలేరా! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

(రెండు కళ్లనీ దగ్గరగా చేసి చూస్తే జాజిపూవులు పూసేయి. ఆకాశంలో మేఘాలు సుతారంగా అలముకొన్నాయి. అక్కడ కాక, నా కళ్లలో ఒక పండువెన్నల యెందుకు కాస్తున్నదో చెప్పరా! స్వామీ! నిన్ను చూసానులే!)

ఈమె దూరదేశం నుండి వచ్చే ప్రియుడి కోసం అలంకరించుకుని నిరీక్షించే స్త్రీ. సాధారణంగా ఈమెను పూలూ, ఆభరణాలూ పెట్టుకున్నట్లుగానూ, ఇంటిని అలంకరించినట్లుగానూ చూపిస్తారు. కానీ భవగంతుడికోసం వేచి చూసే ఈ నాయిక మనసుని కవి తీయగా మారిపోయిన ప్రకృతి ద్వారా తెలియపరుస్తున్నాడు. ఈమె శరీరం మీద పట్టువస్త్రాలూ, సుగంధలేపనాలూ, కింకిణులూ, కంకణాలూ లేవు. ఈమె గదికి తోరణాలూ, పూలదండలూ వ్రేలాడబడిలేవు. బాహ్యాలంకరణలమీద ఈమెకి ధ్యాస లేదు. ఈమె స్థితి వేరు. తన పెరడులో ఒక జాజిపూవు పూసింది. ఆకాశంలో మొయిలు హొయలు పోతూంది. ప్రకృతే, తీయనై ఆమె అలంకారాన్ని సూచిస్తోంది. వాటితో పాటు, ఆమె కళ్లలోనే ఒక పండువెన్నెల! అది స్వామి వస్తున్నాడని తనకి తెలియడం వల్ల పుట్టిన ఆనందమని తెలిసి కూడా, అది యెందుకన్న ప్రశ్నని ఆమె చేత భగవంతుడినే అడిగించడం కవి ప్రతిభ. ఇది కదా తన తనువునూ మనసునూ భగవదర్పణ చేసిన ఒక భక్తురాలి మనసు! ఆ మనసు తెలిసిన ఒక మహాకవి మనసు!

*

# 8

# అలమేలుమంగాస్తవము

మాత్రాఛందస్సులలో అత్యంత ప్రసిద్ధి పొందినవి చతుర్మాత్రల జాతి ఛందస్సులే అని చెప్పాలి. ఈ చతుర్మాత్ర గతి ఉన్న గీతాలు వినపడని రసపిపాసుల చెవులు ఎక్కడా ఉండవు. 'చందన చర్చిత నీలకళేబర పీత వసన వనమాలీ' అని గీతగోవిందకారుడు దివ్యలోకాలలో ఉన్న కవితాకన్యని క్రిందకి దింపి నాట్యం చేయిస్తున్నపుడూ, వల్లభాచార్యుడు 'అధరం మధురం నయనం మధురం' అంటూ తీపి తేనెకే కాదు, కృష్ణవర్ణన చేసే గీతికీ ఉంటుందని నిరూపణ చేసినప్పుడూ, శంకరులు 'భజ గోవిందం, భజ గోవిందం, గోవిందం భజ మూఢమతే' అని భవ్యబోధ సలిపినపుడూ ఈ నాలుగుపొడవుల మాటలే వారికి ఊతమయ్యాయి.

ఈ చతురస్ర గతి కవితకీ, పాటకీ సమస్థితి అని నా ఊహ. కల్పన చేయడంలో, నాలుగుకి సరిపోయే గతులు యేవైనా యేకతాళంలో ఆవృత్తిని కలిగించి, వినసొంపుగా ఉంటాయి. ఆవృత్తిని కలిగించడానికి పదం తరువాత పదం ఒకదానివెంట రావాలన్నది అవసరం కనుక, ప్రతీ పదంలోనూ ఉండవలసిన అక్షరాలు కనీసం రెండని తీసుకుంటే, సంధి ద్వారానూ, సమాసం ద్వారానూ పదాలు కలుపబడుతూనే, విడివిడి పదాలూ ఉండటానికి ప్రతీ పదంలోనూ నాలుగక్షరాలుండటం సరైన సంఖ్య అవుతుంది. ఐదు దీర్ఘ సమాసాలకీ, రెంటికి మించి సంధులకీ దారితీసి నిడివి పెరుగుతుంది. మూడులో సంధికి అవకాశం ఎక్కువ కనుక సులభత్వానికి అవకాశం తక్కువ.

అందుచేతనే ఈ గతిలో సంస్కృతంలో ఉత్కృష్టమైన సాహిత్యం సృష్టించబడింది. తెలుగులో నిడివి గల పదాలు ఎక్కువే కనుక, ఇక్కడి కవులకి పంచమాత్ర, షణ్మాత్రలతో విడివిడి పదాలతో కవితాసృష్టి చేయటానికి అవకాశం దొరికింది. అయితే శ్రవణం చేయడానికి తెలుగులోనూ చతురస్రగతి ఎంతో అందంగా ఉంటుంది.

ఈ చతుర్మాత్రగతి రగడలో రచన చేయబడిన అలమేలుమంగాదేవిమీద స్తవమొకటి చాటుపద్యమణిమంజరిలో ఉంది. ఇది జానుతెనుగునీ, ఆంధ్రాన్నీ కలబోసుకున్న కవిత. అర్థం తెలియకపోయినా, కేవలం చదవడం చేతనే మనసుని ఊయలలూపే శక్తి మాత్రాఛందస్సులలో ఉంది.ఈ కవితకీ అదే వర్తిస్తుంది. ఈ కవిత కూర్చబడిన గతికి హరిగతి రగడ అని పేరు.

అలమేలుమంగాస్తవం నన్ను అమితమైన కావ్యానందానికి లోను చేసింది. తెలుగులో వేంకటేశుని ఇల్లాలిమీద ఇటువంటి కవితని నేను ఇంతవరకూ చదివి యెరుగను. ఇంత అందమైన గతిలో ఉన్న  ఈ అపురూపాన్ని సంగీతజ్ఞులెవరైనా పాడుతుంటే వినాలనిపిస్తోంది. 'మాం దీనమనాథం పాహి రమే, మకుటాలంకృత కల్పకకుసుమే!' అన్న పంక్తికే ఈ అజ్ఞాతకవికి అక్షరలక్షలు ఇవ్వాలని అనిపిస్తోంది.

ఇందులోని గొప్ప పాదాలని యేరలేక, కవితమొత్తాన్నీ ఇక్కడ యెత్తి వ్రాసి, నా శక్తికొలదీ అనువాదం చేస్తున్నాను -

.
సిరి నెఱి నీలపురంగుబెడంగుల - చిన్నరి పొన్నరి పెన్నెఱితురుమును
మురువగు పాపటచుక్క నుచుక్కను - మొత్తపు ముత్తెపు సరిసిందురమును
నుదయారుణకరబింబ ప్రతిబిం - బోద్యద్ధగధగితశిరోమణియును
ముదురరచందురు నుదురు చలములన్ -మొలచెనొయన జనుముఖతిరు మణియును
పచ్చల రచ్చల బొగడల మొగడల - పజ్జలసజ్జల వజ్రపుమురువును
విచ్చలవిడి విడి కెంపులమంపుల - విరివినెరవుకొను బవిరెలహరువును
మగరా కమ్మలకళ్కులతళ్కుల - మలచిన చక్కని చెక్కుల పెక్కును

పగడపు జగడపు మోవిసుపాణియు- పసిమి మిసిమిగల ముక్కరనిక్కును
చంపకసుమ పరిహాసిక నాసిక - చక్కందనముల నింపగుసొంపును
యొరపుగ౹ బరపుగ దయకుదయంబై - యెలపుసొలపుదగు  చూపుల కోపులు
ముఱిపెపు ముచ్చట ముసిముసినగవుల - మొలచిన చిలుకలకలుకుల ప్రోవులు
కులుకు కలికివాలుందెలి గన్నుల - కొమరుల మరుతామర నగుమోమును

అల చిందము చందము గల గళమున - నమరిన మంగళసూత్రపు గోమును
తుదలమొదల సిరిమేలగు జతనల - దొల్కుకళ్కుకుతికంటుత్తండలు
ఉదిరిపసిఁడి మొగ్గలనిగ్గుల జ - గ్గొందగఁ బొందగు సందిటిదండలు
వలయపు నొలపుల ఝుణఝుణరవముల - వలనవలనమగు శ్రీహస్తమ్ముల
జక్కవనడకల చన్నుంగవపై - సొరై తీరై తగుహారమ్ములు
చిక్కఁగ జక్కఁగ మేనంబూసిన - సిస్తగు కస్తురి గాంబూరంబును
నవనిధులును గల శ్రీవర్ణనక - ర్ణముల సెదుర్కొను మణి భుజకీర్తులు
సవరణ జల్ తార్ రైక నలుపు పై - చాందిన చక్కని పతిమలమూర్తులు
చివ్వున నాభి బిలమ్మున వెడలిన - చీమల చాలనఁ దగు నూఁగారును
చివ్వకు నాకొ నీకొ నని బలు - సింగముఁ జెనకెడు కౌనుందీరును
మెచ్చుల కుచ్చెల సెరిపై నొరపై - మేలఁగి చెలఁగు మణికాంచీదామము
గ్రుచ్చుకొనఁగ మానికమున్ జెక్కిన - కొలుకుల యొడ్యాణపుబలు సీమము
కిసమసనిసుమున్ దీవులతీవులఁ - గేరు తీరుపిరుదరుదు నొయారము
మినుకుమినుకుమని కదలిన మెరసెడు - మెఱుఁగు టొయారపుటూరుల బీరము
నందంబు హళాహళికాహళి యఱ - పఱఁదఱమిన జిగిబిగి చిఱుఁదొడలును
కెందామరలన్ గని తా మరలన్ - గెలచిన మృదుపదముల నిలుకడలును
చిటిపొటిప్రేళ్లన్ జిటుకు పొటుకు మనఁ - జిటికెడు మట్టపు మట్టెల భంగులు
పెటుకున జిలిబిలి గలిబిలిగల బొ - బ్బిలి కాయల నిబ్బరపు టెలుంగులు
బడిబడి గలుగలు గల్లన మొరసెడి - బంగరుటందియ కవసింగారము
నడుగుల పైఁబడు బడుగులగాచుట - కయిపెట్టిన గండర పెండారము
శతకోటిరతిప్రతిభాభాసుర - సౌందర్యపుఁ దిరుమేని విలాసము
సతతానత సంరక్షణదీక్షా - సంరంభ సమగ్రసముల్లాసము
కలిగి చెలఁగు శ్రీ వెంకటనిలయుని - ఘన వక్షస్థల సింహాసనమున
నెలకొని యలమేల్మంగాదివ్య వి - నిర్మలనామమునందగు ప్రియమున
సకల జగమ్ముల బొజ్జను నిడికొని - సాకిన తల్లిని నినుఁగొనియాడెద
ముకుళితకరకమలుఁడనై నీకున్ - మ్రొక్కెద నిఁక నా లేములు వీడెద
మాం దీన మనాథం పాహి రమే - మకుటాలంకృత కల్పకకుసుమే
మాం దేవి కృతార్థం కురు పరమే - మంజులచంద్రస్ఫురదురుసుషమే

తుభ్యం మంగళ మార్తశరణ్యే - తుభ్యం మంగళ మభిజనగణ్యే
శ్రీ వరలక్ష్మి జనని నమస్తే - క్షీరాంబుధి సజ్జనని నమస్తే
భవభవాబ్జజ జనని నమస్తే - పాహి మాం జగజ్జనని నమస్తే.

~

సిరులొలికిస్తూ నీలిమ అతిశయించే అందాల జడకొప్పు,
సుందరమైన పాపటచుక్కని ఉచుక్కనిపించే మంచిముత్యంతో పోలిన కుంకుమ బొట్టూ,
ఉదయాన్నే ఉదయించే అరుణబింబానికి ప్రతిబింబంలా ఉదయించిన ధగద్ధగల శిరోమణి,
ముదిరిపోయిన అరచందురుడిలాంటి నొసటిమీద మొలిచిందా అన్నట్లున్న తిరుమణీ,
పచ్చలు కలహించుకుంటూంటే వాటి మొగ్గలలాంటి అంచుల దగ్గర హొయలుపోతున్న వజ్రపు జిగులూ,
స్వేచ్ఛగా యెర్రని పద్మరాగమణులని విరివిగా పొదువుకొని వన్నెలు చిందే బవిరెల అందమూ,
వజ్రపు కమ్మలలో కాంతుల తళ్కులతో మలచిన చక్కనైన పొదిగింపులూ
పగడంతో యుద్ధంచేసే క్రిందిపెదవి మీదకి ఊగుతున్న ముత్యమూ, పసుపువన్నెతో అలరారే ముక్కెరా,
సంపెంగని పరిహసించే నాసిక ఇంపైన నొంపులూ,
విలాసాలతూపులతో కరుణకి ఉదయమైన చూపుల రమణీయతా,
మురిపాల ముచ్చటలతో ముసిముసి నవ్వులతో మొలిచిన చిలుకల మాటల గుంపులూ,
శృంగారకలితమైన నిర్మలమైన వాలుకళ్లలో అందాలమరే నవ్వుముఖమూ,
శంఖంలాంటి గళం చుట్టూతా అమరిన మంగళసూత్రపు గోమూ;
మొదలూ చివరా సిరులు కురిపించే మెడలోని బంగారపు కడ్డీలూ;
బంగారు కాంతులతో మెరిసిపోయే అరవంకీలూ,
గాజుల కదలికల ఝుణఝుణరవాలతో చలించే శ్రీహస్తమూ,
చనుదోయిపైన అందంగా తీరిన హారావళీ,
శరీరమంతా లేపనం కాబడిన కస్తూరీ, కర్పూరమూ;
నవనిధులూ ఉన్న వర్ణనల కర్ణాలని యెదుర్కొనే మణిభుజకీర్తులూ;
సవర్ణమైన జలతారు నీలిరంగు రవికమీద చిత్రించబడిన చక్కని ప్రతిమలూ,
చివ్వుమని నాభి బిలంలోకి వెళ్లిన చీలమగుంపులా ఉన్న నూగారూ;
గొడవకి సిద్ధపడి నీదో, నాదో తేల్చుకుందామని సింహాన్ని యెరిదించే నడుము తీరూ;
సుగుణాల కుచ్చెళ్లపైన వంకరగా ఒరుస్తూ మెలగే మణుల మొలత్రాడూ;
గుచ్చుకుంటూ మాణిక్యాలతో చెక్కబడిన ఒడ్డాణపు పళ్ల నునుపూ;
ఇసుకతిన్నెల ఉత్సాహాన్ని ఆపివేసే పిరుదుల ఒయ్యారమూ;
మినుకుమినుకుమంటూ కదలగానే మెరిసే ఊరువుల గర్వమూ;
యెర్రతారమరలని చూసి, తాను మళ్లీ గెలిచిన మృదుపాదాల నిలకడలూ;
చిన్ని వ్రేళ్లపైన చిటికెడంత ప్రకాశించే మెట్టెలూ;

బొటనవేలికి పెట్టుకున్న ఆభరణపు కాంతుల పెల్లులూ;
ఘులు ఘుల్లుమంటూ శబ్దంచేసే బంగారు అందియ సింగారమూ;
తన పాదాలమీద పడే బడుగులని రక్షించడంకోసం పెట్టుకుందా అన్నట్లున్న గండపెండేరమూ;
కోటిమంది రతీదేవులతో సమానమైన కాంతికలిగిన ఆ తిరుమేని విలాసమూ;
ఎప్పుడూ శరణుజొచ్చేవారిని రక్షించే వేగిరపాటుతో కూడిన సమగ్రమైన సముల్లాసమూ;
వీటితో శ్రీవేంకటనిలయుడి వక్షస్థలమనే సింహాసనమ్మీద నెలకొని,
సకలలోకాలనూ నీ కడుపులోపెట్టుకుని కాపాడే అలమేలుమంగా! నా తల్లీ! నిన్ను
కొనియాడతాను.
ముడిచిన చేతులతో నీకు మొక్కుతాను.
నా లేములన్నీ విడిచిపెడతాను.
అమ్మా, దీనుడినై, అనాధనైన నన్ను రక్షించు! మకుటంమీద అలంకరించుకున్న
పారిజాతపుష్పాలు కలదానా!
నన్ను కృతార్థుడిని చేయి!
మంజులమైన చంద్రుడిలాంటి శోభకలదానా,
నీకు మంగళమగుగాక!
అధిగతపుణ్యా! అతిలావణ్యా!
ఆర్తశరణ్యా! అభిజనగణ్యా!
నీకు మంగళమగుగాక!
క్షీరాంబుధికీ, సంసారానికీ,
శివుడికీ, బ్రహ్మదేవుడికీ తల్లివైన నీకు నమస్సులు!
వరలక్ష్మీ! జననీ, జగజ్జననీ!
పాహి మాం!

*

# 9

## విష్ణువుపై కొన్ని చాటువులు

ప్రార్థన మానవజాతికి ఉన్న గొప్ప వరం. భగవంతుడి కోసం బుద్ధి తలుపులని తెరుచుకున్న మనిషి అహంకారాన్ని తగ్గించి, బాలుడిగా చేసి, ఆలోచనలనే యెల్లలు తెంచి, ఆయుష్షుని పెంచే సంజీవని ప్రార్థన. ఈ వస్తువే కనుక ఉండి ఉండకపోతే, పెరిగే వయసుతో పెరిగే కుదింపుల స్వతంత్రత శిరసుమీద పెట్టే బరువుని మనిషి మోయడం అసాధ్యమయి ఉండేది.

'భగవంతుడి గది ఎపుడూ తెరుచుకునేఉంటుంది కానీ, దాని నిడివి చాలా తక్కువ ' అంటారు రమణులు. ఒక బాలుడు మాత్రమే పట్టగలిగే మార్గమది. కనులు మోడ్చి, భగవంతుడికోసం తపిస్తూ మన హృదయం వేసే కేక మనలోని పెద్దరికాన్ని బాలుడిగా చేసి, బాలుడిని పెద్దవాడిని చేస్తుంది. అపుడు సంతరించుకున్న ఆ చూపులో ఊపిరి తీసుకునే ఒక నిర్మలత్వం అంతులేని బలాన్ని ఇస్తుంది. ఈ పరివర్తక శక్తి ప్రార్థనలో ఉంది. మనిషికి ప్రార్థన ఎపుడూ చిత్రమైన ప్రహేళిక లాంటిది. మామూలుగా అది మనిషి శక్తిహీనతలోనుంచి, ఈశ్వరుడి శక్తిమత్వానికి యెదురుగా పుడుతుంది. అది లౌకికప్రార్థన. కానీ అది మనిషి శక్తిమత్వంలోనుండి ఈశ్వరుడి సర్వశక్తిమత్వానికి ముందర ఉద్భవించినపుడు ఆధ్యాత్మికప్రార్థన అవుతుంది. ఆ ప్రార్థనలో వినిమయం ఉండదు. వినియోగం ఉండదు. విచారం ఉండదు. తీపి మాత్రమే ఉంటుంది. అదే దాని అసలు స్వరూపం.

మహాకవి ఎవరు అంటే నాకు ఉన్న కొన్ని ఊహలలో ఒక ఊహ ఇది - గడియకు గంటమైనా లేకుండా ఆశువుగా ఐదువందల పద్యాలు అల్లగలిగేవాడు గొప్ప కవే కావొచ్చు. లౌకిక ప్రపంచాన్ని తేనెలో ముంచి తేల్చేవాడు గొప్పకవే కావొచ్చు. సత్యాన్ని నిర్భయంగా చెప్పి, సమాజాన్ని మేలుకొలిపేవాడు గొప్పకవే కావొచ్చు. కానీ, వినిమయంలేని, నిస్వార్థమైన హృదయం తపనతో పెట్టే అనిర్వచనీయమైన ఒక కేకని దొరకబుచ్చుకుని, అందులో ముందు తాను రమించి, తన ప్రతిభతో కవితా సామాగ్రిని ఆ కేకకి జోడించి కావ్యసృష్టి చేసేవాడు మహాకవి. అటువంటి ఒకమాట, ఒక కవిత, ఒక పంక్తి చూడటానికి అష్టోత్తరం లాగానో, సహస్రం

లాగానో, పొగడ్తలాగానో కనిపించినా, అవి మనసులో చేరి, అందజేసే బలాన్ని మానవుడు ఊహించలేడు.

అటువంటి విష్ణుమూర్తిమీద కొన్ని ప్రార్థనల కవితలను, చాటుపద్యమణిమంజరి లోనుంచి యేరి, ఇక్కడ మీతో పంచుకుంటున్నాను.

1

పరుగై రావదె, త్రోవ గానవొ సురల్ ప్రార్థించిరో సామగా
నరుచిం జిక్కితొ యాంజనేయుని వడిన్ రావించితో జానకీ
చరణాబ్జంబులు నొచ్చెనో యితరదేశప్రాణి సంరక్ష నే
మరితో జాలమిదేలనయ్య, రఘురామా, ఆర్తరక్షామణీ.

రఘురామా, పరుగున రావెందుకు?
దారి తెలియడంలేదా?
దేవతల ప్రార్థనలు స్వీకరిస్తున్నావా?
సామగానశ్రవణంలో తేలియాడుతున్నావా?
ఆంజనేయుని పిలిపించుకున్నావా?
సీతాదేవి కాళ్లు నెప్పి పెడుతున్నాయా?
మిగిలిన దేశాల ప్రాణులని రక్షించడంలో ఏమరిచావా?
ఆర్తరక్షామణీ,
పరుగున రావెందుకు?

2

మొగము నెలనవ్వు మొలకరేయెండలగాయువాఁ డావుల గాయువాఁడు
పశుపాలికమోవి బంగాళి చక్కెరగ్రోలువాఁ డొక పిల్లఁ గ్రోలువాడు
తిరుమేన బంగారు జరబాజు గలుగువాఁడు తనంత గలుగువాడు
అఖిలపావనమైన యడుగుఁ దామరతేనె జాలువాఁ డెలమి యీఁజాలు వాడు

శ్రవణములు వ్రేలు కర్ణికారములవాఁడు
తీర్చినట్టున్న ముక్కుముత్తియమువాఁడు
కళుకు లీనెడునెద మానికంబులవాఁడు

మనలఁ గరుణా విధేయుడై మనుచుఁగాత.

ముఖంపై మందహాసంతో
వెన్నెలలు కాసేవాడు, ఆవులని కాచేవాడు;
గోపికల పెదవితేనెని గ్రోలే వాడు, పిల్లంగ్రోవి కలవాడూ,
దేహంమీద పచ్చనిబట్ట కలిగిన వాడు,
తనంత తానుగానే కలిగే వాడూ,
పవిత్రమైన పాదాలదగ్గర నదిని కలిగిన వాడు,
దేన్నైనా ప్రేమతో ఇచ్చేవాడూ
కర్ణాల దగ్గర కర్ణికారాలని అలంకరించుకున్నవాడూ
తీర్చినట్లుగా ఉన్న ముక్కుక్రింద ముత్యం ఉన్నవాడూ
గుండెలమీద మాణిక్యాలని అమర్చుకున్నవాడూ
మనలని కరుణతో రక్షించునుగాక.

3

మూడుకన్నుల వేల్పు ముంజేతికడియంబు పఱుపు పచ్చడమునై యొఱపు మిగుల
అక్కున విలసిల్లు చక్కని పూఁబోణి యాలును మనుమరాలై తనర్ప
బొడ్డుతామరఁ బుట్టి పొలుపారుబిడ్డఁడంతటికిఁ దీర్పరియుఁ దాతయును గాఁక
పులుఁగులగమికాడు పలుదెఱుంగుల దాట గుఱ్ఱంబు బంటునై కొమరు మిగుల

ప్రాఁతచదువులు వలకాలిపసిఁడి యందె
యనుఁగుఁ గూర్చుండు పలకయునగుచు మీఱ
నందములకెల్ల యైననిన్ డెందమందుఁ
దెల్లమిగఁ జేర్తుమోయన్న నల్లనన్న.

నల్లనన్నా!
మూడు కన్నులున్న శివుడి ముంజేతి కంకణం
పరుపూ, పక్కా అయి స్థిరంగా కుదురుకోగా,
హృదయంలో కొలువైన చక్కని పూబోణి
ఆలుగానూ, మనుమరాలిగానూ అతిశయించి ఉండగా
బొడ్డుతామరలో పుట్టిన అందమైన పిల్లవాడు
అంతటినీ తీర్చేవాడూ, తాతా అవగా;

గరుత్మంతుడు అనేకవిధాలుగా దాటులు కొట్టడంలో
వాహనమై, బంటు అయి ఉండగా
పాతచదువులైన వేదాలు
కుడికాలి అందెగానూ,
యింపుగా పక్కనే ఉండే పలకగానూ మీరగా
ఆనందానికి హద్దు అయిన నిన్ను
హృదయంలో నిర్మలంగా చేర్చుకుంటాము.

4

అందంపుఁజుంచుతో నాణిముత్తెమ్ముల జోకైననెఱరావిరేక తోడ
నిద్దంపు వజ్రాల మద్దికాయలతోడ మురుపైన చిఱునవ్వుమొగము తోడ
బొజ్జపై నటియించు పులిగోరుతాళితో రమణీయమణికంకణముల తోడ
నవరత్న ఖచితఘంటలమొలనూలితో నీటైన గిలుకుటందియల తోడ

తోడ లక్ష్మణభరతశత్రుఘ్నులాడఁ
బరుగులెత్తఁగ వెనువెంట బరుగులెత్తి
తల్లి కౌసల్య రార నా తండ్రి యనుచు
నెత్తి ముద్దాడు శ్రీరామునే భజింతు.

అందాల చుంచుతో ఆణిముత్యాలతోటి
గాలికి మెల్లగా ఊగుతున్న రావిరేకతో
కాంతిమంతాలైన వజ్రాల మద్దికాయలతో
సుందరమైన నగుమోముతో
బొజ్జమీద కదులుతున్న పులిగోరుల దండతో
రమణీయమైన మణికంకణాలతో
నవరత్నాలూ పొదిగిన మొలనూలితో
నీటుగా ఉన్న అందియలతో
తనతోపాటు లక్ష్మణభరతశత్రుఘ్నులు
ఆడుతూ పరుగులుపెడుతుంటే
వెనువెంట తానూ పరుగులుతీసి
కౌసల్యా దేవి 'రారా నాతండ్రీ' అంటూ ముద్దుచేసే
శ్రీరాముడిని నేను భజిస్తాను.

5

నా చిన్ని రామన్న నను(గన్న తండ్రి రా నన్నేలునయ్య నాయన్న రార
నా ముద్దులయ్య నా సామి రా(గదవోయి అప్ప చక్కదనాలకుప్ప రార
నా పెన్నిధానమా నా పుణ్యమూర్తి రా నా యింద్రనీలరత్నంబ రార
బంగారుకొండ నాపాలి భాగ్యమ రార అమృతంపు( జెలమ రా యయ్య రార

చూతమెవ్వరువత్తురో చూత మనుచు(
దల్లి పిలువంగ నందియల్ ఘల్లుమనగ
నవ్వి చెలరే(గి గునగున నడచివచ్చు
నట్టి కౌసల్యగారాపు(బట్టి( దల(తు.

నా చిన్ని రామా, నన్ను కన్న తండ్రీ!
నన్నేలువాడా, నా అన్నా, రారా!
నా ముద్దులయ్యా! నా స్వామీ! రారాదా!
చక్కదనాల కుప్పా! రారా!
నా పెన్నిధానమా, నా పుణ్యమూర్తీ,
నా యింద్రనీలరత్నమా,
నా బంగారుకొండా!
నా పాలి భాగ్యమా!
నా అమృతపు చెలమా! రారా!
చూద్దాం, ఎవరు వస్తారో, ఇప్పుడు - అంటూ
తల్లి కౌసల్యాదేవి పిలవగా
కాలి అందెలు ఘలుఘల్లుమనుకుంటూ నవ్వి,
ఉత్సాహంతో చెలరేగి
గునగునమని నడిచివచ్చే
కౌసల్య ముద్దులపట్టిని తలుస్తాను.

(ఈ పద్యం స్పష్టమే కానీ ఉండబట్టలేక అనువాదం చేసాను)

6
తిన్నని కస్తురి నామము

సన్నపుఁదలపాగ చుంగు చక్కదనంబున్
జెన్నలర మిమ్ముఁ గంటిమి
కన్నుల తెలివెంత వింత కదిరి వసంతా!

కదిరి వసంతా!
నిలువుగా ఉన్న కస్తూరి నామమూ,
సన్నని తలపాగ కుచ్చూ,
చక్కదనాలు పోతుండగా అందాల నిన్ను చూసాము.
కన్నుల తెలివి ఎంత వింతదో కదా!

7

నారాయణ నీ నామము
నారాయణ వ్రాయవయ్య నా నాలుకపై
నారాయణ నిను నమ్మితి
నారాయణ కావవయ్య నారదవరదా!

8

నిరుపమ బాలానందా
వరవనితాచిత్తచోర వరవసునందా
గిరిధర శరణు ముకుందా
కరుణాకర నీవు నాకు గతి గోవిందా.

9

సింగపుమోమువాడు, తులసీదళదామమువాడు, కామినీ
రంగదురంబువాడు వలరాయని గాంచినవాడు భక్తికు
ప్పొంగెడు వాడు దానవులపొంకమడంచెడు వాడు నేడు శ్రీ
బంగరు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్.

*

# 10

## శ్రీనాథుడి భృంగపంచకము

ధ్వని కావ్యానికి ఆత్మ అని కొందరి మతం. అనిర్వచనీయమైన కావ్యానికి అంత ఖచ్చితమైన నిర్వచనాన్ని ఇచ్చింది ఆనందవర్ధనుడనే కశ్మీరదేశానికి చెందిన లాక్షణికుడు. ఈ ధ్వని సిద్ధాంతం భారతీయ కావ్యప్రపంచాన్ని ఒక ఊపు ఊపింది. ఎంతగా అంటే, ఉత్తమకావ్యానికి ధ్వని (ధ్వన్యతే అస్మిన్నితి) అని మారుపేరు వచ్చేటంతగా. కావ్యస్వరూపాన్ని ఈ సిద్ధాంతం సరిగ్గా పట్టుకుందా లేక కొంతవరకూ కుదించిందా అన్న ప్రశ్న పక్కకి పెడితే, కవిత్వానికి ఉన్న ప్రధాన ధర్మాలలో ఒకటైన పరోక్షత్వాన్ని ఈ సిద్ధాంతం మరింతగా పైకి తీసుకువచ్చింది. అప్పటిదాకా శబ్దమూ, అర్థమూ వాటి గుణాలంకారాలూ మాత్రమే ప్రధానంగా ఉన్న భారతీయ లాక్షణిక ప్రపంచంలో ఈ సిద్ధాంతంతో కావ్యానికి మూలమైన ఆత్మని పట్టుకునే అన్వేషణ మొదలైంది.

పరోక్షప్రియా ఇవ హి దేవాః అంటుంది వేదం. దేవతలు పరోక్షంగా మాటలాడితే ఇష్టపడతారట. ప్రత్యక్షంగా 'నీ ముఖం సుందరంగా ఉంది ' అనడంలో కలుగని ఒక ఉల్బణం 'నీ ముఖం చంద్రబింబంలా ఉంది ' అనడంలో మనసుకి కలుగుతుంది. రెండవమాట ఇచ్చేది మొదటి మాట ఇచ్చిన అర్థాన్ని అయినా, అందులోని ఊహని అర్థం చేసుకున్నపుడు అనుభూతికి మరింత ఔన్నత్యం ఏర్పడుతుంది. ఇది అర్థంలోని అందం. అలాగే అల్లికలో మధువులూరే పదాలతో ఆవృత్తి, నానార్థత్వం లాంటి వాటి సహాయంతో కలిగేది శబ్దంలోని అందం. ఈ రెండూ కావ్యానికి శరీరం లాంటివి. ధ్వని అన్నది ఈ రెండిటి కంటే వేరుగా వీటిలో అంతర్లీనంగా ఉండే వస్తువు.

~

పక్షీ చ శాఖానిలయం ప్రవిష్టః
పునః పునశ్చోత్తమ సాంత్వవాదీ
సుస్వాగతాం వాచముదీరయానః
పునః పునశ్చోదయతీవ హృష్టః

ఇది వాల్మీకి సుందరకాండలో వ్రాసిన ఒక శ్లోకం.

'సుస్వాగతవచనాలని పలుకుతున్నట్లుగా, మళ్లీ మళ్లీ సంతోషితవు కమ్మని ప్రేరణ ఇస్తున్నట్లుగా మళ్లీ మళ్లీ సాంత్వనగా కూస్తూ, ఒక పక్షి చెట్టుమీది తన కొమ్మపైకి ప్రవేశించింది ' అని సంగ్రహమైన అర్థం.

ఈ శ్లోకమున్న చోటు చిత్రమైనది. ఈ శ్లోకానికి ముందు అశోకవనంలో జరిగిన సన్నివేశం ఇది -

1. రావణుడు తుచ్ఛమైన మాటలు మాట్లాడటం
2. సీతాదేవి నిరాకరణతో కోపంతో వెనుతిరగడం
3. తరువాత అక్కడి రాక్షస స్త్రీలు సీతను చంపుతామని బెదిరించడం
4. త్రిజట అనే ఒక వృద్ధరాక్షసి తనకి కనిపించిన రామవిజయస్వప్నాన్ని చెప్పడం.

ఈ శ్లోకం తరువాత జరిగిన సన్నివేశం -

1. సీత రావణుడి మాటలు తలుచుకుని చిన్నపిల్లలా ఏడవడం
2. తన జడతో ఉరిపోసుకోవడానికి ప్రయత్నించడం.

పై శ్లోకం సీతాదేవికి ఆనందాన్ని కలిగించే త్రిజట స్వప్నం తరువాత వచ్చినా, శ్లోకం తరువాత ఆమె దుఃఖం ఏమాత్రమూ తగ్గదు. ఆ సమయంలో చెట్టుమీద ఆ పక్షి ఉనికి నిజమే కావొచ్చు. అయినా ఆమె మీద ఏ ప్రభావమూ లేని ఆ చోటులో వాల్మీకి ఆ శ్లోకాన్ని వ్రాయడం వెనుక ప్రయోజనమేమీ లేదు. పైగా ఆ శ్లోకంలో ఆ పక్షి ఆ సుస్వాగత వచనాలు యెవరికోసమో, తన కూతలతో ఎవరిని ఆనందపడమని చెబుతుందో ఆ వివరం కూడా లేదు. నిజానికి, ఆ పక్షిని సీతమ్మ గమనించి ఉండదు. గమనించినా, ఆ ప్రవర్తనని పట్టుకుని స్పందించే స్థితిలో ఆమె లేదు.

ఆ శ్లోకం లో మాటలలో పైకి కనిపించే అర్థం, భాషలోని లాలిత్యంతో పాటుగా, ఔచిత్యవంతమైన మరొక అర్థం ఏదో ఉంది. ఆ అర్థం తెలియాలంటే చదివేవాడు కవిభాషతో పాటు, మనసుని అర్థం చేసుకోవాలి. అపుడు ఆ సుస్వాగతం అవలీలగా సముద్రలంఘనం చేసిన ఒక వానరం కోసమనీ, వాడు చెట్టుకొమ్మమీద ఉండి కేవలం తన మాటలతో సీతాదేవి దుఃఖాన్నంతా తోడేస్తాడనీ, అది తెలిసి ఆమెను ఊరడిల్లమని ఆ పక్షి చెబుతున్నట్టు తెలుస్తుంది. ఈ ఆకళింపుకి కవితతో ప్రయాణిస్తే చాలదు, కవితో ప్రయాణించాలి. అంటే ధ్వని పండాలంటే కవికీ, రసజ్ఞుడికీ ఒకే సంస్కారం కావాలి.

~

అనుభూతి ఆస్వాదనలో కవితో సమానంగా రసజ్ఞుడు యెదగగలిగే ఒక సదవకాశం ధ్వని సిద్ధాంతంలో ఏర్పడుతుంది. ప్రతిభ చేత, ఊహ చేత, మనోశక్తి చేత కవి ఉన్నతుడైనా, కావ్యంగా అతడు ఒక భావాన్ని వ్యక్తపరచినప్పుడు కవి హృదయాన్ని పట్టుకోగలిగే రసజ్ఞుడు కవితో సమానం అవుతాడు. కవితని కూర్చడానికి కవికి యే సంస్కారం ప్రేరకమవుతుందో, ఆ కవితని ఆస్వాదించడానికి రసజ్ఞుడికి అదే సంస్కారం హేతువవుతుంది.

ఇటువంటి ఒక ధ్వని ప్రధానమైన కవిత, తెలుగు చాటు సాహిత్యంలో ఉంది. పేరు భృంగపంచకము. దీనిని వ్రాసింది శ్రీనాథుడు. ఈ కవితని చాటుపద్యమణిమంజరిలో నేను చదివినప్పుడు ఆశ్చర్యానికి లోనైయాను. దానికి కారణం, ఈ భాష, ఈ శైలీ ఆధునిక తెలుగుభావకవులకు మల్లే ఉండటం. వాళ్ల బుద్ధి వికసించడానికి కొన్ని వందలయేళ్లకు ముందే మహాకవి శ్రీనాథుడు ఈ ఫణితికి బీజం వేసాడు అనిపించింది. ప్రాచీన తెలుగు పద్య వాఙ్మయంలో కవిత మామూలుగా నిడివి అయినది. కావ్యమంటే కొన్ని వందల పద్యాల సమాహారం. దానికి వ్యతిరిక్తంగా బ్రతికింది చాటు సంస్కృతి. చాటువంటే ఒక సాధారణంగా ఒక పద్యమనే ఊహ. ఐదారు పద్యాలతో ఒక విషయం మీద కవిత పద్యంలో ఎక్కువగా కనపడదు. తెలుగులో ఇటువంటి కవితలకి తరువాత వచ్చిన ఖండకావ్యాలవరకూ ఒక దారి ఏర్పడలేదని అనుకుంటూ ఉన్న నాకు ఈ కవిత సరికొత్త తావులని దగ్గరగా తీసుకువచ్చింది.

~

ఈ కవితకి పూర్వరంగం ఉంది. పూర్వం ఒక రాజుగారి భార్యకి ఆ రాజ్యపు మంత్రికీ ఆకర్షణ ఏర్పడింది. ఒక రోజు రాజు కార్యాంతరంమీద బయటకు వెళ్లవలసివచ్చినపుడు ఈ మంత్రి దొంగతనంగా అంతఃపురానికి వచ్చి రాణితో సల్లాపాలాడుతున్నాడు. అప్పుడే కోటకి తిరిగివచ్చి అంతఃపురంవైపుగా వస్తున్న రాజుని గమనించిన ఒక చెలికత్తె తలుపులు వేసి ఉన్న ఆ గదిలోకి పోలేక, మంత్రిని దాక్కోమని చెప్పడానికి ఒక తుమ్మెదని అడ్డంపెట్టుకుని బిగ్గరగా ఇలా అంది -

మాయురె! భృంగమా! వికచమల్లికలన్ విడనాడి తమ్మిలో<br>
నీయెడఁ బూవుఁదేనియల నింపుజనింపఁగ గ్రోలి సౌక్కియున్<br>
బోయెద నన్నభ్రాంతి నినుఁ బొందదు; రాజుదయించె, నిప్పుడీ<br>
తోయజపత్రముల్ వరుసతోఁ ముకుళించెఁ జలింపకుండుమా.

(బాపురే, తుమ్మెదా! వికసించిన మల్లెల దగ్గరకి పోకుండా ఈ రాత్రివేళ తేనెని త్రాగుదామని పద్మం మీద వాలావు. తేనెని గ్రోలి, మైకంలో తూలి తిరిగి వెడదామనుకున్నావు. కానీ అది నీ భ్రాంతి! చంద్రుడు ఉదయించాడు. పద్మాలు ముకుళించాయి. యిప్పుడు చడీ చప్పుడూ చేయకుండా ఉండు!)

ఈ మాటలు విని ఇరుకు చోటులో దాక్కొన్న మంత్రి కాసేపటికి ఇబ్బంది పడుతూ కదలడం వల్ల చప్పుడవుతుండడం గమనించి ఆమె ఇలా అంది -

అళికులవర్య! పద్మముకుళాంతరమందు వసింప నేరమిన్
జలనము సెందెదేమి నవసారసమిత్రుడు రాకయుండునా?
తొలఁగక యందె యుండుమికఁ దోయజవైరి తిరంబె రాత్రి యీ
కలవరమేల? తమ్మి తుద గానక తూఱక యూరకుండుమా.

(మగ తుమ్మెదా! ముకుళించిన పద్మంలో ఉండలేక కదులుతావెందుకు? పద్మబాంధవుడైన సూర్యుడు రాకపోతాడా? అందులోనే కదలకుండా సర్దుకో! దేనికీ కలవరం? ఈ రాత్రీ, ఈ చంద్రుడూ స్థిరమా!? పద్మపు కొనలని చూడకుండా ఊరుకొని ఉండు.)

ఈలోగా పతివ్రత అయిన మంత్రిభార్య రాత్రి గడుస్తున్నా తన భర్త రానందుకు దిగులుపడి వెతుక్కుంటూ రాగా, ఆమెని చూస్తూ చెప్పిన పద్యం -

అళినీ! తత్తఱమేలె నేడు నిదె నీ యాత్మేశుఁడౌ భృంగమున్
జలజాసక్తమరందపానవశతన్ సాదందుడై యున్నవాఁ
డులు కింతేనియు లేక నీవరుగుమా! యొప్పార నిప్పాట నీ
చెలువుండుం బరుతెంచుఁ దేకువను రాజీవంబు పుష్పించినన్.

(ఆడతుమ్మెదా! తత్తరపాటెందుకు? ఈ వేళ నీ భర్త పద్మమకరందాన్ని సేవిస్తూ ఆనందంతో ఉన్నాడు. అంచేత దిగులుపడకుండా వెనక్కి మరలు! వేకువలో పద్మం పుష్పించగానే నీ భర్త నీ దగ్గరకి రాగలడు)

పరిస్థితి సర్దుమణిగాక, మంత్రిని బయటకు రావచ్చని చెబుతూ చెప్పిన పద్యం -

పతి నిద్రించిన వేళ రాదగున యో పద్మారి యీ కేళికా
యతనంబందునతిశ్రమన్ విభుడు నిద్రాసక్తుడై యుండె నీ
శతపత్రేక్షణ మోము వాంచినది నీ సామర్థ్యమున్ జూపఁ బో
కతి వేగంబున నేగుమా! తొలగి మాయాత్మల్ సుఖంబందగన్.

(ఓ పద్మారీ (చందురుడా/ మంత్రీ), భర్త (సూర్యుడు/ రాజు) పడుకున్న సమయంలో అతని స్త్రీలదగ్గరకు (పద్మం/ రాణి) రావడం సబబేనా? ఈ కేళీగృహంలో శ్రమచేత భర్త నిద్రలో ఉన్నాడు. నీ పద్మేక్షణ (పద్మం/ రాణి) ముఖం వంగి ఉంది. (రాత్రయిన కారణంగా/తప్పు చేసానన్న సిగ్గుతో). సామర్థ్యాన్ని చూపించడం మానుకొని నీ మాయాత్మ తొలిగి సుఖాన్ని పొందే విధంగా వేగంగా వెళ్లిపో. )

ఈ సంఘటనతో రాణికీ, మంత్రికీ తమ తప్పు తెలిసివచ్చింది. అయితే రాణి మంత్రితో ఉన్న సమయంలో అతని మెడలో తన హారాన్ని వేసింది. మంత్రి తరువాతిరోజు సభకి ఆ హారంతోనే వచ్చాడు. అది గమనించిన ఆ చెలికత్తె రాజు గుర్తుపడతాడేమో అని భయపడి ఒక బట్టుకవి వేషంలో సభలోకి వచ్చి ఈ పద్యం చదివిందట. అందులో 'మానపరిపాల' అన్న మాటని బట్టి మంత్రి గ్రహించి ఒక శాలువాలో తెలియకుండా ఆ హారాన్ని చుట్టి ఆమెకి పారితోషికంగా ఇచ్చేసాడట -

అతులసభాంతరస్థిత బుధావళికెల్ల జోహారు, వీరరా
హుతులకు మేల్జోహారు సతతోజ్జ్వల విక్రమ సార్వభౌమ సం
తతికి జోహారు వైభవవితానపురందరుడైనయట్టి భూ
పతికి జోహారు, మానపరిపాల! జోహారు ప్రధానశేఖరా.

(వీరులకు జోహారు. ఎప్పుడూ ప్రకాశించే పరాక్రమం కల వారికి జోహారు. ధనసంపన్నుడైన ఈ భూపతికి జోహారు. తప్పు తెలుసుకుని శీలాన్ని కాపాడుకున్న మానపరిపాలుడవైన ప్రధానమంత్రీ! నీకు జోహారు.)

~

ఈ కవితతో మణిమంజరిలో నేను పరిచయం చేద్దామని అనుకున్న కవితలు పూర్తయ్యాయి. చాటుసంస్కృతి స్వరూపం తెలిసినవాళ్లకూ, ఆ సాహిత్యం మీద మక్కువ ఉన్నవాళ్లకూ మణిమంజరి పుస్తకమంతా చాటుకవులూ, వారి జీవితాల విశేషాలతో వీనులవిందుగానే

ఉంటుంది. కానీ అటు వందల పద్యాలసంఖ్యలున్న పద్యకావ్యాలూ, ఇటు ఒకటో రెండో సంఖ్యలతో ఉండే చాటుపద్యాలూ కాకుండా వేరే భాషలలో ఉన్నట్లుగా కవిత వ్రాయడమనే మార్గం ముందు నుంచీ తెలుగుపద్యసాహిత్యంలో ఈ నేలమీద ఉందని చెబుదామనే ఉద్దేశంతో ఆ మార్గంలోని కొన్ని తీయనైన కవితలను స్థాలీపులాకన్యాయంగా చూపుదామని ప్రయత్నం చేసాను. చాటు సంగ్రహాలు తెలుగులో రెండుమూడు ఉన్నా, ఇటువంటి కవితలని ప్రయత్నపూర్వకంగా అందించింది చాటుపద్యమణిమంజరి మాత్రమే.

ఆయా కవితలని అల్లి, తేనెలని స్రవింపచేసిన ఆ జ్ఞాతాజ్ఞాతకవులకి నా నమస్సులు.

*